విశ్వసాహిత్యమాల —౨౯

# భ య ం

(అలగ్జాండర్ అఫినాజెనీవ్)



అనువాదం

—రా మ మో హ న్.

# పరిచయం

## గ్రంథకర్త:

అఫినోజినీవ్ 1904 లో పుట్టేడు. అతని తల్లి ఒకపల్లెటూరి బడి పంతులమ్మ. తండ్రి వ్రాయసకాడు. అఫినోజినీవ్ తన స్వతంత్రరచన పది హేనో యేటనుంచే ఆరంభించేడు. ఇరవైఏళ్ళు వచ్చేటంతకి పాటలూ-పద్యాలూ మూడుసంపుటాలుగా వెలువడ్డాయి అతని రచనలు. మొదటి నుంచీ విప్లవంలో ఉత్సాహం చూపెట్టేడు. విప్లవంనాటికి అతనివయస్సు 13. ఏళ్ళే కాదూ? కాని 1920 నాటి కప్పుడే అతడు కొంత పేరు సంపాదించేడు. '20 లో అంటే తన పదహారోయేట ఒక్కమారుగా పదహారు వుద్యోగాలలో నియమించబడి నిర్వహించేడు.

1923 లో మాస్కోలో జర్నలిజమ్ ఇన్‌స్టిట్యూట్‌లో చదువుతూన్నప్పుడే తన మొదటినాటకం వ్రాసేడు. తరువాత గడిచిన నాలుగైదేళ్ళలోనూ మరో పదినాటకాలు వ్రాసేడు. 1929 లో వ్రాసిన 'చూడక్' తో అతని పేరు ప్రఖ్యాతికి వచ్చింది. ఈ "భయం" తో అతడు సోవియట్ రచయితలలో అగ్రగణ్యుడయ్యేడు.

## గ్రంథం:

దీనిని అతడు 1931 లో వ్రాసేడు. విజ్ఞానశాస్త్రాలు రాజకీయాలతో సంబంధించని ప్రత్యేకవిషయాలుకావు. వర్గకలహంలో అవికూడా ముఖ్యమైన ఆయుధాలే, అనే సిద్ధాంతంమీద ఈనాటకం వ్రాసేడు. సోవియటు యూనియనులో శ్రామిక ప్రభుత్వానికీ - మేధావివర్గానికీ గల ఆంతరికసంబంధాల్ని చాల అద్భుతంగా చిత్రించేడు గ్రంథకర్త.

ఈనాటకం సోవియటు యూనియనులోకల్లా విశేష ప్రచారంగల నాటకాలలో ఒకటి. మొదటి రెండేళ్ళలోనూ అది 400 మార్లు ప్రదర్శించ బడిందట. నేటికీ చాలాపట్టణాలలో ఇంకా ఉత్సాహంతో ప్రదర్శింప బడుతూంది.

భ య ం:

ఇంక, నా ఇతర అనువాదాలకి వలెనే ఇదీ ఒక్క-భావ మినహాగా మిగిలింది అంతా గ్రంథకర్తదే. తెలుగులో దొరకని, ఉచ్చరించడంలో బాధ కలిగించేవాని నన్నిటినీ, ఇంగ్లీషుపదాలలోనే వాడేను.

1 ఫిబ్రవరి 1941 అనువాదకుడు.



# పాత్రలు

ఇవాన్, ఇలిచ్, బోరోడిన్: ప్రొఫెసరు. ఇన్‌స్టిట్యూట్‌కి సైంటిఫిక్ డైరెక్టరు; వయస్సు 60.

వాల్యా, వాలంటీనా: ఆయన కూతురు; శిల్పి; వయస్సు 23.

నికోలాయ్ కాశ్యానోవిచ్ బోబ్రోవ్: ఇన్‌స్టిట్యూట్‌లోని పరిశోధన శాఖకి డైరెక్టరు. వాల్యామగడు; వయస్సు 38.

విసారియన్ జఖారోవిచ్ జఖారోవు: పురాతన పాశ్చాత్యమత చరిత్రాచార్యుడు; వయస్సు 60.

హెర్మన్ పిటల్డోవిచ్ కాస్టాల్‌స్కీ: బోరోడిన్ ప్రియశిష్యుడు. ఇన్‌స్టిట్యూట్‌లోని గ్రాడ్యుయేట్ స్టూడెంటు. వయస్సు 28.

సెమియాన్ సెమియానోవిచ్, వర్గాసోవు: ఇన్‌స్టిట్యూట్ కార్యదర్శి.

అమాలియా కార్లోనా, అమాలియా: ఒక ముసలమ్మ.

యెలేనా మిఖలోనా మాకరోవా, ఎలేనా: కమ్యూనిష్టు. ఇన్‌స్టిట్యూట్‌లో రీసెర్చి అసిస్టెంటు. వయస్సు 30.

నికోలాయ్ పెట్రోవిచ్, షెకోవాయ్: కమ్యూనిష్టు. ఇన్‌స్టిట్యూట్‌లో గ్రాడ్యుయేట్ స్టూడెంటు. ఆమె మగడు. వయస్సు 33.

నటాషా: షెకోవాయ్ మొదటిభార్యవలన కలిగిన కూతురు. వయస్సు 10.

క్లాడ్యావాసిలీనా స్టాసోవా, క్లారా: కమ్యూనిస్టు. ఫ్యాక్టరీలో పనిచేస్తూంది. కమ్యూనిస్టుపార్టీ యొక్క కంట్రోల్ కమిషన్‌లో సభ్యురాలు. వయస్సు 60.

హాన్సేన్, కిం బయీావు: కాజర్. కమ్యూనిస్టు. గ్రాడ్యుయేటు. వైవీ జక్ యట్.

బోరిస్ నెమోవిచ్ నెవిస్కీ: కమ్యూనిస్టు. ఇన్స్టిట్యూట్ యొక్క మేనేజింగ్ డైరెక్టరు.

ప్రెసీడియమ్‌లోని అవసరసభ్యులు.

పరిశోధకురాలు.



## కొన్ని శబ్దాలు :

వైవీజన్ యట్: పరిశోధనారంగంలో గాని, ప్రభుత్వపరిపాలనారంగంలో గాని, ఉన్నతవిద్య పొందడానికై కమ్యూనిస్టు పార్టీ శాఖలచేతా, కర్మాగారాలచేతా పంపబడిన శ్రామికులు - రైతులు.

  

సమయం: ఈనాటిదే.

ప్రదేశం: మాస్కో: సోవియట్ - యూనియన్....

  

# మొదటి అంకం.

ఒకటో రంగం

[ప్రొఫెసర్ బొరోడిన్ యింట్లోని కచేరీసావడి. విక్టోరియన్ యుగపు అలంకారాలు. ప్రొఫెసరు యొక్క చదువులగదిలో పెట్టగా మిగిలిన పుస్తకాల బీరువాలు దీనిలో అమర్చబడినాయి. ఎడమచేతివేపున తిన్నె. తిన్నెమీద ప్రొఫెసరుకూతురు వాలంటీనీ చెక్కిన శిల్పం పెద్ద ఎత్తయిన బొమ్మ ఒకటుంది. ప్రస్తుతం అది కనబడకుండా తడిముతకగుడ్డ ఒకటి క్రిందికంటా వ్రేలాడేలా కప్పబడివుంది. తెరలేచేటంతకుముందు నుంచీ పియానోతో శృతిగలిపి పాడుతూన్న కాస్ట్రాల్‌స్కీ గొంతుక వినబడుతూంటుంది. మృదువుగా మధురంగా ఎత్తుగడచేసేడు. రెండోపదం వద్దకి వచ్చేటంతకి గొంతు సాఫుదేరుతుంది. తెరలేచునంతకి వాలంటీనా తిన్నెవద్ద నిలబడివుంటుంది. ప్రొఫెసర్ బోబ్రోవూ - బొరోడినూ, కాస్ట్రాల్‌స్కీ సంగీతంవింటూ ఒకేబెంచిమీద ఒకరిప్రక్క వొకరు కూర్చుండివుంటారు. బొరోడిన్ విప్లవానికి పూర్వంనాటి పేరుపడ్డ సైంటిస్టు. ముసలివాడైనా, బలంగా, అందంగావుంటాడు. ఉద్రేకి. కోపిష్టి. పాతబట్టలు కట్టినా, పరిశుభ్రంగావున్నాయి. గడ్డం దువ్వి సంరక్షణలో వుంచేడు. కూతురుకూడా అందమైనదే. అలంకరణవాంఛ బాగా కనిపిస్తుంది. ఆమె మగడు ప్రొఫెసరు బోబ్రోవుయువకుడు. మంచిచదువున్నవాడు. భార్యయందు విశేషం ప్రేమగలవాడు. కాస్ట్రాల్‌స్కీ పడుచువాడు. ప్రొఫెసర్ బొరోడిన్‌కి ప్రియశిష్యుడు. దుస్తులవిషయంలో బాగాశ్రద్ధ తీసుకుంటాడు. నూతన సోవియటు పద్ధతులకి విపరీతంగా కనిపించేటట్లు ఎక్కువశృంగారంగావుంటాడు. పూర్వకాలపుపద్ధతులలో పెరిగినమనిషి.]

కాస్ట్రాల్‌స్కీ—(పాడుతాడు) నాయాశ, నాకలల, నావిశ్వాసాల, పాదముద్రలనునిచి, పరుగెత్తే నేళ్ళు, మృదుమగురకంఠంబు మొద్దుబారింది.

పడుచుదనపు నిగారింపుపాలిపోయింది. ఈఆశ, ఉత్కంఠ హృదయమూ, ఏల? గడచిపోయిన యేళ్ళు, తిరిగితేగలవ? ఆనాటి ప్రథమసమాగమానందంబు, ఆగగుర్పాట్లు ఆముద్దుమురిపాలు కన్నీరు......

బొరోడిన్—ఏంబాగాలేదూ? ప్రేమనిగురించి ఎంతకవిత్వం వ్రాసేరు మానవులు! కాని, ఏంచెయ్యగలం. అది మానవాతీతమైన భావానుభూతి. మానవుడు వచ్చినదిమొదలు మానవజాతిఅస్తమించేవరకూ, ఎప్పుడూ వారిజీవిత విధానాన్ని నడిపించేది. — ప్రేమ, ఆకలి, కోపం, భయం, అంతే. ఔనుగాని సుఖంగా వెళ్లివచ్చేవా? ఏలావుంది?...నికోలాయ్.

బోబ్రోవు—ఆ, బాగానేవుంది...పాట చాలాబాగుంది.

బొరోడిన్—నిజం. కాని, కారణం ఏమిటి?... కారణరహితమైన సహజభావంలోంచి వచ్చింది. గనకనే అంతబాగుంది. మానవుని ప్రవర్తన అంతానాలుగు మూలశక్తులమీద ఆధారపడివుంది. - ప్రేమ - భయం - కోపం - ఆకలి. మిగిలినవన్నీ వీనిలోంచి పుట్టినవే. అంతే ప్రతికళాభిజ్ఞుడూ ఈవిషయాలు మనస్సులో వుంచుకోవాలి. చూడు వాలంటీనాని. నాభావాల్ని చెక్కడంలో ప్రదర్శించి అద్భుతమైన బొమ్మని తయారు చేసింది. పోటీలో ఆవిడిదే మొదటిబహుమతీ. చూసుకో, పరీక్షక సమితి వచ్చేవేళ అయింది. ముద్దుగానికాదూ నువ్వు. (సగర్వంగా) నావాల్యావాళ్ళందరికన్నా తెలివైనది.

కాస్టాల్‌స్కీ—మొదటిబహుమతి నీదేనని నాకు బాగావిశ్వాసం.

వాలంటీనా—మావారు ఒప్పుకోరు. ఆయనగారికి ఇది బాగులేదు.

బోబ్రోవు—వాల్యాబొమ్మ అంత మొదటి బహుమతిపొందతగి వుందా? నాకు అనుమానంగావుంది.

వాలంటీనా—మీరే పరీక్షకులైతే?...

బోబ్రోవు—మొదటిబహుమతి నాభార్యకే రావడం సహజం.

కాస్టాల్‌స్కీ—నికోలాయ్ కాళ్యానోవిచ కి వస్తు - మనుష్య పరిజ్ఞానం నశించింది. దేశం తిరిగిన ఫలితం అనుకుంటాను.

వాలంటీనా—ఆయనగారు ఇల్లాంటి స్వల్పవిషయాలు మనస్సుకి పట్టించుకోరు. (బోబోరికువేపు తిరిగి) కాని, నిజంచెప్పాలంటే మీకు వ్యక్తిత్వంలేదు. ఎవరిమాటలో పట్టుకు ప్రాకులాడవలసినవారే. అస్తమానం ఎలకలతోవుంటే మీకు బుర్ర నశించింది.

బరోడిన్—వాల్యా!

బోబోరికు—నిజమేకావచ్చు.

బొరోడిన్—ఏమిటది? (వాలంటీనాతో) నెల్లాళ్ళకి ఇప్పుడే కలుసుకున్నారుకదా, ఇప్పుడేకోపాలా?...అతన్నిచూసి జ్ఞానం తెచ్చుకోకూడదు? (కాస్టాల్‌స్కీని చూపుతాడు.) అతని భవిష్యత్తుని నిర్ణయించడానికి అక్కడ మీటింగు జరుగుతూంది. ఈయనగారు ఇక్కడ ఆనందంగా ప్రేమగీతాలు పాడుకుంటూ వినోదిస్తూన్నారు. ఔనులే. కాస్టాల్‌స్కీ వంశంలోవాడుమరి. వాళ్ళ కుటుంబం అందరూ అదేమోస్తరు. మహాదిట్టమైనవాళ్ళు...ప్రొఫెసర్లూ, అకాడెమీ మెంబర్లూ, సెనేటర్లూనుఅందరూ కూడా.

కాస్టాల్‌స్కీ—అదీసంగతి. అకాడమీలో మెంబరూ సెనేటు సభ్యుడూ అయినవానికొడుక్కి మీఅసిస్టెంటుగావుండే అదృష్టంలేదు. ఓకమ్మరపు పనివాడికూతురు ఎలెనామాకరోవా మీకు అసిస్టెంటు అవుతుంది. ఆవిడనే విదేశాలకి పంపిస్తారు.

వాలంటీనా—హెర్మన్ విటల్యోవిచ్‌కి మంచి గుండెనిబ్బరంవుంది.

కాస్టాల్‌స్కీ—ప్రారంభసమావేశంలో జరిగిన తీర్మానం నన్నుతోసేసింది.

బొరోడిన్—కాని, దానిని పైఅధికారులముందుపెట్టేం. నాఅసిస్టెంట్లని, నేనే ఏరుకోవాలి. అది నాహక్కు. అధికారమండలి సమావేశంజరుగుతూంది. మనతరఫున మాట్లాడడానికి సెమియాన్ సెమియానోవిచ్ వెళ్ళేడు. మరేం విచారించకు హెర్మన్. నీలో అసాధారణమైన ప్రజ్ఞవుంది. మాతరవాత రావలసినవాడివి నువ్వే. పైగా సెమియాన్ సెమియానోవిచ్ ఎఫ్రెమ్ ఎఫ్రిమోవిచ్‌కి ఫోన్ చేసేడు. వాళ్ళిద్దరూ ఈవిష

యమే అలగ్జాండర్ గ్రిగరోవిచ్‌తో సంప్రదించేరు. వాళ్లుకూడా సాయం చెయ్యడానికి వాగ్దానం చేసేరు.

కాస్ట్రాల్‌స్కీ—స్పష్టంగా వాగ్దానం చేసేరా?

బొరోడిన్—ష్...ష్!...రహస్యం...కుట్ర...

కాస్ట్రాల్‌స్కీ—అయితే నాకు ఆశలు వున్నాయన్నమాట.

వాసిలీనా—ఏమైనా అదృష్టవంతుడివి, హెర్మన్! నువ్వు ముట్టుకున్నదల్లా బంగారం. (తలుపుచప్పుడు) కళాసమితి అనుకుంటా.

కాస్ట్రాల్‌స్కీ—సెమ్యాన్ సిమియానోవిచ్, నేచెప్పేనుచూడు.

(ఇద్దరూ ఆతురతతో ఎదురుచూస్తూంటారు. ప్రొఫెసరు ఖజారోవు వస్తాడు. పరిస్థితు లేవీ బాగులేనట్లు ముఖమే చెబుతూంది. ముసిలివాడు. పూర్వకాలం మనిషి. నూతనసోవియట్ సమాజంలో వుండదగినవాడు కాదు. అంతా అనిశ్చితభావాలూ, ఆధ్యాత్మికచింతనా గలవాడు.)

బొరోడిన్—విసారియన్ ఖజారోవిచ్, ఎప్పుడూ రానివాడివి ఈలావచ్చేవు? చాలాఆనందకరంగావుంది. రా కూర్చో. రా. నీకో శుభ వార్త చెప్పబోతున్నా. హెర్మన్ నాఅసిస్టెంటు కాబోతూన్నాడు. రీసెర్చికి బర్లిన్ వెళ్ళబోతాడు. ఇంక వాలంటీనా చెక్కడం, రెడ్‌స్క్వేర్‌లో క్రెమ్లిన్‌కి ఎట్టఎదట స్థాపించబోతూన్నారు. అన్నీ సుముఖంగా వున్నాయి. ఉ. నావద్ద ఒకగ్రాడ్యుయేట్ స్టూడెంటువుంది. ఎలెనా మాకరోవా అంటూ ఆమెగారు ఓకమ్యూనిష్టు మానవస్వభావపరిశీలనకి ఒకలేబరేటరీ తెరవాలంటుంది..." ఇంతకాలమూ కుందేళ్ళస్వభావాన్ని పరిశోధించేవు. చాలు, ఇంక ఈపాటికి నీదృష్టి మానవసమాజంమీదికి మరల్చవలసిన దినం వచ్చింది..." అని కూర్చుంది. ఏమనేది? మనపుర వాళ్ళకి విగ్రహడావిడితప్ప మారుఆలోచనలేదు...ఏమంటావు?

బోబ్రోవు—మానవస్వభావవివేచనం రాజకీయవేత్తల వ్యవహారం మీరూ నేనూ జీవశాస్త్రజ్ఞులం.

కాస్ట్రాల్‌స్కీ—ఈజీవశాస్త్రమే రాజకీయాలకి స్వస్తిచెప్తుంది. మానవుని భవిష్యత్తు కార్యకారిణీసమితులలోనూ, కమ్యూనిస్టుపార్టీసంస్థల

లోనూ కాదు నిర్ణయించబడవలసినది. జీవచైతన్యశక్తిని పరిశోధించే ఇన్స్టిట్యూట్‌లలో నిర్ణయించబడాలి.

బోబ్రోవు-- మాకరోవా అభిప్రాయం అదికాదు.

కాస్టాల్‌స్కీ—కావచ్చు. ఇది నాఅభిప్రాయం.

బోబ్రోవు—ఈ సెల్లాళ్ళప్రయాణంలోనూ చాలాసంగతులు చూడగలిగేను. నాకు రాజకీయాలంటే ఏమిటో తెలిసింది. కుందేళ్ళనిపరిశోధించడంలోకన్న మానవుని పరిశోధించడం ఎక్కువగడిబిడియైన వ్యవహారం అని ఇప్పటికి నానమ్మకం.

బొరోడిన్—ప్రజల్ని అదుపులోవుంచుకోడం అనేది అంత చులకనైన పనికాదు.

వాలంటీనా.—కుందేళ్ళమాదిరిగానే ప్రజల్నికూడా పరిశోధించడం అదో చిత్రంగావుంటుంది. చెవివెనక గీరుతే నీకుగడు మంచిగా మాటవింటాడు! (తలుపుచప్పుడు. వర్గాసోవ్ వస్తాడు.) సెమియాన్ సెమియానోవిచ్! (కాస్టాల్‌స్కీ-వర్గాసోవ్ దగ్గిరికి పరుగెత్తుతాడు.)

కాస్టాల్‌స్కీ—కాయా...పండా? (ఆగుతాడు.)

వాలంటీనా—అభినందించివచ్చా?

వర్గాసోవు—పరాజయం!

బొరోడిన్—పరాచికం చేస్తున్నావు! సెమియూన్! హాస్యం!

వర్గాసోవు—పరాచికంకాదు. ఇవాన్! మనం వోడిపోయేం.

బొరోడిన్—అయితే, ఎఫిమ్ ఎఫ్రిమోవిచ్, అలగ్జాండర్ గ్రిగరోవిచ్‌లు ఏమంటూన్నారు?

వర్గాసోవు-- వాళ్ళ కీఆశలులేవు. (నిశ్శబ్దం)

బోబ్రోవు—అయితే మాక్రోవారీసెర్పి అసిస్టెంటుగా నియమించబడిందా?

వర్గాసోవు...ఔను. ఎలెనామిఖలోనామాకరోవా.

వాలంటీనా—అయితే బెర్లిన్ వెళ్ళేది ఎవరు?

వర్గాసోవు—ఇంకెవరు?...ఆవిడే...వసంతఋతువులో అవుతుంది ప్రయాణం...ఏమీ అనుకోకేం. (కూర్చుంటాడు:)

బొరోడిన్—(అరుస్తాడు.) నేనొప్పుకోను! స్కౌండ్రల్స్! ఎందుకూకొరగాని చవటలు!

(వర్గాసోవ్ అదిరిపడి నిలబడతాడు.)

వాలంటీనా—బాబాయ్!

బొరోడిన్—రాజీనామా యిచ్చేస్తా. సోమరిపోతులు! (ఆవేశంతో గదిలో అటూయిటూ హడావిడిగా పచారుచేస్తాడు.) ఏదీ కాగితం ఒకటి ఇల్లాఇవ్వండి. వ్రాసిపారేస్తాను. లండన్ పోతాను. వాళ్ళు ఎంతకాలం నుంచో ప్రాధేయపడుతూన్నారు రమ్మని. నే నీ మాకరోవాతో కలిసి పని చెయ్యను. వట్టిపుట్టిబుర్ర. వట్టికర్రతల. (బల్లమీదకొడుతూ) మట్టిముద్ద! దూదిపింజ! కర్రపొట్టు! అంతే మరేవీ లేదు.

వాలంటీనా—ఊరుకో బాబాయ్! ఊరుకో! నీగుండె.

బొరోడిన్—పోనీలే. గుండె ఆదురువస్తే వచ్చింది. ఈదేశంలో సైంటిస్టుల అవసరం ఏలావున్నాయో ప్రపంచానికి తెలియపరుస్తా. వైపీ జన్ ట్స్! వీళ్ళా ముందుకొచ్చేది? కూలివాళ్ళ స్కూలులోంచిబాధ్యతగల శాస్త్రజ్ఞపదవులకి విద్యార్థుల్ని పంపడమా? ఏమిఆలోచన? వాక్యంలో 'కామా'లు ఎక్కడపెట్టాలోకూడా తెలియదుకదా ఆవిడకి. మరోభాష ఏదీరాదుగదా? మహాగొప్ప అసిస్టెంటు! చెప్పుకుంటే సిగ్గు.

జఖారోవు—(మనస్సులోనే అనుకున్నట్లు) ఎందుకూపొందని జీవితం.

బొరోడిన్—ఏమిటి?

జఖారోవు—మనది ఎందుకూపొందని జీవితం అంటూన్నా. ఓర్పు వహించాలి. శ్రీకృష్ణుడేమన్నాడు; "కష్టసుఖాలు వస్తూంటాయి: అంతమాత్రంచేత అధైర్యపడకు. వీటన్నిటికి అతీతుడవై పరివర్తించడానికి ప్రయత్నించు?"

బొరోడిన్—ప్రయత్నించు. ప్రయత్నించు.

(వెనకకీ ముందుకీ పచారుచేస్తాడు.)

వాలంటీనా—పాపం, హెర్మన్! చాలా విచారపడుతూన్నాడు.

కాస్టాల్‌స్కీ—ఏమీలేదు. (హేళనగా) నేను చాలా అదృష్టవంతుణ్ణి. నేముట్టుకున్నదల్లా బంగారం. అంతా ఆనందమే. ఊఁ. ఎంత అదృష్టం? గురూజీ! కుందేళ్ళతో చిరకాలం బాధపడ్డారు. ఇంక 'వైపీజన్‌ట్సీ' ల నడవడికలు పరిశోధించవలసిన సమయం వచ్చింది. అదికూడా సహజచైతన్యశక్తి వలన ఏర్పడినదే. గురూజీ! వాళ్ళకి మనంఅంటే భయంగా వుంది. వాళ్ళు మనల్ని నమ్మడంలేదు, ఎలకలమాదిరిగా మనశాస్త్రీయపరిశోధనలలోకి ఏలూ - లకులూగా ప్రవేశిస్తూన్నారు. విజ్ఞానం చేతచిక్కాక మనపనిపట్టేస్తారు.

బోబ్రోవు—నాకు చాలా సంతోషంగావుంది. (అందరూ అతనివేపే తిరిగిచూస్తారు.) నువ్వు బెర్లిన్ వెళ్ళకపోవడం నాకు చాలా సరదాగావుంది.

బొరోడిన్—ఎలకలన్నావే అది పొరపాటు. అబ్బాయి! నువ్వు పొరపడ్డావు. అల్లాగ అనుకోడానికి వీలులేదు. ఈ వైవీజన్‌ట్సీలకి నాయందు భక్తివుంది. విశ్వాసంవుంది. నన్నొక నిధిలాచూసుకుంటున్నారని కూడా చెప్పవచ్చు. నన్నుగొప్పగా చూసుకుంటూన్నది—ఎలకలా? తప్పు. పొరపాటు. దానికి నేను అంగీకరించను.

కాస్టాల్‌స్కీ—మాపెద్దలు చేసిన అపరాధాలు ఏమిటోకూడా మేము మరిచిపోయినా, వాటిమూలంగా మాకు బాధతప్పడంలేదు. బార్బరోసాకి ఎర్రటి గడ్డంవుందనీ, ఫ్రాన్సుని హెన్రీలుకొంతకాలం, లూయీలుకొంతకాలం పాలించేరనీ తెలుసు. అంతే. అంతకుమించి గతం ఏమీ జ్ఞాపకంలేదు. అవసరంలేదుకూడాను. మాతండ్రిచేసేడు ఇదంతా. విన్నావా? మాతండ్రి!

బొరోడిన్—తప్పు తప్పు. నువ్వు కళ్ళేనా తెరవని రోజులనాటి కప్పుడే మీతండ్రి అకాడమీలో సభ్యుడయ్యేడు...తప్పు...

వాలంటీనా—హెర్మన్! ఇంకా బాగా చదువు. ఇదివరకటికంటె రెండు - మూడురెట్లు బాగా చదువు. బాగా పైకిరా. ఇతరుల్ని మించు.

ఒకశాస్త్రీయగ్రంథం వ్రాయి. పేరుతెచ్చుకో. తప్పకుండా నువ్వు పేరు తెచ్చుకోగలవు.

బొరోడిన్—ఔను. నువ్వు. ఇంకా బాగా చదవాలి. నేనుకూడా సాయంచేస్తాను. ఏదోఒక ప్రత్యేకవిషయం తీసుకుని కృషిచెయ్యి.

కాస్టాల్‌స్కీ—అల్లాగే రాత్రి తెల్లవార్లూ చదువుతాను. తీవరం మానేస్తా. సంగీతం కట్టిపెట్టేస్తా. పేరుపడాలి గొప్పసైంటిస్టని. అప్పుడు ముట్టుకోవాలి. సాంఘికపరిస్థితులు కారణంగా నాలాగే అణచివేయబడు తూన్నవాళ్ళందరిబదులూ ప్రతీకారం తీర్చుకుంటాను.

బోబ్రోవు—ఏంచేసినా, చేయిగాని, తీవరంమాత్రం మానకు, నీపుణ్యమాయిరి!

వాలంటీనా—మావారు చెప్పినమాట నమ్మేవుగనక హెర్మన్, నన్నుగురించి ఎంత తెలుసో నిన్నుగురించీ అంతే ఎరుగును. ప్రపంచం అంటే ఏమిటో, మనుష్యజీవితం అంటే ఏమిటోకూడా తెలియనిమనిషి. ఆచెవులపిల్లులూ - ఆకుక్కలూ అదే ఆయన ప్రపంచం. హెర్మన్! ఎన్నిఆటంకాలు వచ్చినాసరే, ఒకమహాపురుషుడివికా. (వెడుతుంది.)

కాస్టాల్‌స్కీ—నికోలాయ్ కాశ్యానోవిచ్, కోటోమిన్ ప్రియ శిష్యుడివిగదా, తనశిష్యుడు ఇబ్బందిలోవున్నప్పుడు ఈలాగే వదిలిపెట్టే సేడా?

బొరోడిన్—నిజం. కోటోమిన్ తనశిష్యులమీద ఈగవాలనిచ్చే వాడుకాడు. ఔను. కోటోమిన్‌కి ఈవిషయం తెలియపరుస్తా. ఆతనిదగ్గర ఫిర్యాదుచేస్తాను. ఫిర్యాదుచేసితీరుతా... ఏమిటి?

వర్గాసోవు—ప్రొఫెసర్ కోటోమిన్‌ని నిన్నరాత్రి అరెస్టుచేసేరు.

బోబ్రోవు—కోటోమినా? అరస్టా?

బొరోడిన్—అంతకంతకి మరీఅధ్వాన్నంగావుందే. అల్లాంటివాణ్ణి! ఎవ్వరికీ అపకారంచేసే రకంకాదే. ఏమిటిది? ..వీళ్ళకేం పోయేకాలం వచ్చింది? అరరే!

బోబ్రోవు—ఏమైనా అడిగితే ప్రజలు వర్గపోరాటం సాగిస్తున్నా రంటారు రాజకీయవేత్తలు.

జఖారోవు—నన్నుకూడా...ఇవాళ!... నన్నుకూడా యూనివర్సిటీలోంచి తరిమేసేరు.

బొరోడిన్—వేళాకోళం. అబ్బే! ఏమిటి?

జఖారోవ్—ప్రాచ్యమతాలమీద నావుపన్యాసం పూర్తిఅయినాక చప్పిదవడలూ వాడూ ఒకకుర్రాడులేచి, కళ్ళజోడులోంచి చూస్తూ నీకు మార్క్సుయిజ్ఞ పునాది లేదు—అన్నాడు.

బొరోడిన్—అయితే నువ్వేమిటి అన్నావు?

ఖజారోవ్—కోపం మనస్సులోనే అచుకున్నా. అహింసఅంటూ ప్రాకులాడే మానవుల్నిచూసినప్పుడు నవ్వాలనుకుంటూవుండేవాడు అంటారే ఆ "డీజూరో" మృగయాదేవత జ్ఞాపకంవచ్చేదు... నేను మాట్లాడకుండా ఈవలికి వచ్చేసి, నీసలహా తీసుకుందామని తిన్నగా వచ్చేసేను.

(కింబయీవ్ అనే కూలీవస్తాడు. పడుచువాడు. మనిషి అమాయికంగా వున్నా ఆత్మవిశ్వాసంగలవాడు. మంగోలియజ్ఞ లక్షణాలు పూర్తిగావుంటాయి. మాటలోకూడా ఆయాసవుంది.

కింబయీవ్—ఆహా ఎంతమంచిపుస్తకాలు! ప్రొఫెసర్ బోబ్రోవ్! (ఆశ్చర్యంతో తెల్లబోతూన్న బొరోడిన్ చేయిపట్టుకువూపి) నాపేరు, నాపేరు హుస్సేన్ కింబయీవ్. గ్రాడ్యుయేట్ స్టూడెంటుని 'వైవీజక్ యట్'ని. ఆరోగ్యమా? కామ్రేడ్! నాకాగితాలు ఇవిగో.

బొరోడిన్—బోబ్రోవుని నేనుకాదు. నీకు మతిపోయింది.

బోబ్రోవు—బోబ్రోవుని నేను.

కింబయీవు—క్షమించండి! (కాగితాలు చూపుతాడు.) కిల్-ఓడా నుంచి ఇప్పుడే ట్రయిన్‌లోవచ్చేను. వర్కూర్స్‌విద్యాలయంలో చదివేను. ఇప్పుడింక ఈఇన్‌స్టిట్యూట్‌లోవుంటాను. గట్టిగా చదివేస్తా...(అమాయికంగా) ఓరిబాబో! ఎన్నిపుస్తకాలు? ఇవన్నీ చదవవలసినవేకాదు: ఇరవై

యేళ్ళు వచ్చేవరకూ ఖా, ఏమీ చదవలేదు. ఆలోటు ఇప్పుడు కూడదీసుకోవాలి. కాజర్‌స్థాన్‌లో ప్రజలు పాపం చాలా అనాగరికంగావున్నారు. నేను ఆలోటు పూర్తి చేసుకోవాలి. ఇక్కడికి చదవడానికే వచ్చేను. ఒక్క క్షణంకూడా వ్యర్థంగా పోనియ్యకుండా వచ్చిపడ్డా మాకక్కడ పుస్తకాలూలేవు చెప్పేవాళ్ళూలేరు.

బొరోడిఙ్ — పరాయివాళ్ళ కొంపలో అర్థరాత్రి దూరడానికి బదులు రేపు ప్రొద్దుట ఇన్‌స్టిట్యూట్‌కే రాకపోయినావూ?

కింబయీవ్ — అప్పుడే అర్థరాత్రా? ఇప్పుడేకాదూ ఎనిమిదిఅయిందీ. ఒక్క సాయంకాలంమాత్రం ఎందుకు వ్యర్థంగాపోనియ్యాలి. బోబ్రోవు ఏదో ఓపుస్తకం ఇస్తే ఈవేళ రాత్రికి చదువుకుంటాను. చూసేవూ కామ్రేడ్, నీపుస్తకాలనిండా దుమ్మే. ఎప్పుడూవీటిని చదవవా? నీపుస్తకాలన్నీ వ్యర్థంగావుండిపోతున్నాయి. పుస్తకాలు వట్టినే పడివుండటానికా వుంట?

బోబ్రోవు — కింబయీవ్! రా. వెడదాం.

(బోబ్రోవు, కింబయీవూ వెడతారు.)

జఖారోవ్ — ఇల్లాగేవున్నాడు. చప్పిదవడలూవాడూ, నన్ను తరిమిన ఆకుర్రాడు.

బొరోడిఙ్ — కిర్ఘిషియానుంచి అడివిమనుష్యులు ఇళ్ళల్లో చొరబడి, పెద్దగోలచేసి, ఎవడినో వొకణ్ణి పట్టుకోవడమా? వీళ్ల సంగతి చెప్తా. సెమియాన్! జఖారోవ్‌తో మాట్లాడి, ఆతడిని ఈఇన్‌స్టిట్యూట్‌లో లైబ్రరియఙ్‌గా వెయ్యి. ఆమార్క్సిస్టు పునాదులేమిటో నేచెప్తా. విసారియన్! ఈస్థానం తీసుకుంటావా?

ఖజారోవ్ — ఇంతకన్నవుందీ?

వర్గాసోవ్ — నేచేసిపెడతానుకాదూ? నువ్వు డిస్మిస్ అయినదానికి పూర్వపుతేదీ దరఖాస్తుమీదవేస్తే, పూర్తిగా నీయిష్టంమీద చెయ్యబడ్డ మార్పులావుంటుంది.

జఖారోవ్—అనుభవంగలవాడివి. నానమస్కారం. (మోకాళ్ళ మీద పడతాడు, బొరోడిన్ వెనక్కి తప్పుకుంటాడు.)

బొరోడిన్—ఆతడిని లేవదియ్యండి. అదేంపని జఖారోవిచ్! విద్వాంసు డెప్పుడూ అల్లాగ వెలితిపడకూడదు. అబ్బెబ్బే!

వర్గాసోవ్—(ద్వారందాకా వెళ్ళి, ఆగి, కాస్తాల్‌స్కీ వేపు తిరిగి) అబ్బాయి, నేనున్నాలే, ఫరవాలేదు. నువ్వు చెప్పినవన్నీ నామనస్సులో పెట్టుకున్నాను. నాశక్తికొలదీ - ప్రతిఫలం ఏమీ కోరను, నీకు సాయం చేస్తాను.

కాస్టాల్‌స్కీ—అయితే కోటిమిన్ అరస్టయాడా?

వర్గాసోవ్—ఔను.

(కాస్టాల్‌స్కీ, వర్గాసోవ్, జఖారోవ్ వెడతారు. బొరోడిన్ ఏదో ఆలోచిస్తూ కూర్చుంటాడు. ఒంటరిగా వున్నాడు. సమయంలోనే ఒకసన్నని, పొడుగుపాటి ఆడది బెదురుతూ నెమ్మదిగా లోపల ప్రవేశిస్తుంది. బట్టలు చిందరవందరగా పీలికలయి వున్నాయి. ఈమె పేరు అమాలియా)

అమాలియా—ఓరి దేవుడా! ఎంతముసిలివాడివి అయిపోయేవు?

బొరోడిన్—(అదిరిపడి, వెనుతిరిగిచూస్తాడు.) ఎవరికోసంవచ్చేవు? నావలన నీకేంపని జరగదు.

అమాలియా—ఒక్కకళ్లుమాత్రం మారలేదు...ఆశ్చర్యం ఏంవుందీ? ఇన్నేళ్ళు...

బొరోడిన్—నిన్నెప్పుడూ చూడలేదే.

అమాలియా—ఎంతకాలంగడిచింది?....ఇవాన్ ఇలిచ్! తాతియానాదినోత్సవం - విద్యార్థి దినోత్సవం - ఆపందిట్లో నీపాలు - విద్యార్థి సమావేశం - ఓపడుచుకుర్రవాడు వేదిక ఎక్కి - పద్యాన్ని వచనంలా చదవడం - జ్ఞాపకంవుందా? - "ఈఅనాఘ్రాతకు సుమాలపరిమళములు."

బొరోడిన్—(తలతడుముకుంటూ) ఔను జ్ఞాపకంవుంది, ఆచది

వింది నేనే. (మళ్ళీ ఆలోచిస్తాడు.) ఈ అనాఘ్రాత కుసుమాల _ పరిమళములు...ఆగు...తరవాత...'శీతువునమంచుదడిసిన కిటికిటీలు. చీకటింటను వెలిగెడి దీపశిఖలు'...ఔను. జ్ఞాపకంవచ్చింది...అయితే?

అమాలియా—అది నడిశీతాకాలమే. అప్పుడే నేను గులాబీపూలగుత్తి వొకటి తెచ్చియిచ్చేను.

బొరోడిన్—ఆగు చెప్పా. (గంతువేసి, అటూ, ఇటూ పచారుచేస్తాడు.) అమాలియా కార్లోనా. .మోలీ...ఆగు...పదిహేడేళ్ళపడుచు...తెల్లగా మిలమిలలాడే గౌను...అరే! ఆక్షణంలోనే నీవంటే వెర్రిప్రేమ కలిగింది. అతాలియానా దినోత్సవం మొదలుకొని-ఆశ్చర్యం!

అమాలియా—అప్పటికి చిన్నవాడివి. చాలా అందంగావుండేవాడివి. మెత్తగా, వుంగరాలజుట్టు...

బొరోడిన్—నువో అడ్మిరల్ కూతురువి. ఒకమిలిటరీ ప్రొసిక్యూటర్ని పెళ్ళాడి, ఆచిన్నవాడిని మరిచిపోయేవు.

అమాలియా—అబద్ధం! నే నెన్నడూ నిన్ను మరవలేదు...ఎప్పుడూ...

బొరోడిన్—బాగుంది. మన చిన్ననాటి ప్రేమని మరచిపోకుండా ఒకరికొకరు చెప్పుకోవడం చాలా ఆశ్చర్యంగా వుంటుంది. ఇంక అక్కర లేదు. ఆశ్చర్యంగావున్నా, ఆహ్లాదకరంగావుంది కాదు. ఆనందకరంగా లేదూ? (చీదుతాడు.)

అమాలియా—నాభర్త క్రిమియాలో చచ్చిపోయేడు.

బొరోడిన్—బిడ్డలెవరేనా కలిగేరా? క్షేమంగా వున్నారా?

అమాలియా—నాకొడుకు నీఇన్స్టిట్యూట్లోనేపనిచేస్తూన్నాడు. (ఆశ్చర్యపడుతూన్న ప్రొఫెసరు ముఖంచూసి) కాని పైకి అన్నావు గనక. ఆవిషయం మరెవ్వరితోటీ అనవద్దు. నాతో బాంధవ్యం వొదులుకున్నాడు. నాకొడుకని చెప్పుకోడానికికూడా ఒప్పుకోడు. అంతా

కొత్త జీవితం ఆరభించేదు. వాడిజోలికి నేపోదలచుకోలేదు. అప్పుడప్పుడు ఒక్కమాటు చూడాలనిపిస్తూంటుంది. ఎలావున్నాడేమిటి?

బొరోడిన్—చాలా ఆశ్చర్యంగావుందే. నిన్న కాదన్నాడు? ప్రేగు తెంపుకున్నాడు? నీకొడుకు?

అమాలియా—నావగ్గమూలం ఆతడికి చాలా బాధకరం. నారహస్యం కాస్తా బైటపెట్టేవుకనకసుమా, కొంపతీసి...ఆలా చెయ్యకేం? నీయందు నాకుగల విశ్వాసంకొద్దీ, నీకిది చెప్పేను. ఇప్పుడేదో సోది చెప్పకు బ్రతుకుతూన్నాను.

బొరోడిన్—దారుణం!

(కాస్టాల్‌స్కీవస్తాడు.)

కాస్టాల్‌స్కీ—(బొరోడిన్‌తో) ఆటుకమీషన్ సభ్యులు ఒకరు వచ్చేరు. (వాలంటీనాగదికి వెడతాడు.)

బొరోడిన్—(అమాలియాతో) నాతోరా, ఆవ్యవహారం ఏదో ఆలోచించుదాం. ఎల్లాంటిరోజులు వచ్చిపడ్డాయి?

(అమాలియా బొరోడిన్‌లు వెడతారు. ఎదుటిగుమ్మంలోంచి క్లారా, నటాషాలు వస్తారు. క్లారా పట్టుదల, ఆత్మవిశ్వాసమూగల స్త్రీ. నిర్మొగమాటమైన మనిషి. పూర్వకాలపు బోల్షివికు. నటాషాకి 10 ఏళ్ళుంటాయి. మెడలో ఎర్రటి జేబురుమాలు కట్టుకుంది. అది 'పయొనీర్' గుర్తు. (బిడ్డల క్షమ్యానిస్టుసంస్థ) అక్కడున్న కొన్ని ఆటబొమ్మలవైపుకి నటాషా ఆకర్షితురాలవుతుంది.)

నటాషా—అమ్మో! ఎన్నిబొమ్మలో!

(బోబ్రోవు, కింబయీవు వస్తారు.)

కింబయీవు—నమస్తే. కామ్రేడ్ బోబ్రోవు! రాత్రి తెల్లవార్లూ చదివేస్తా.

బోబ్రోవు—వద్దు రాత్రిళ్లు చదవకు. జబ్బుచేస్తుంది.

కింబయీూవు—త్వరగా పూర్తి చెయ్యాలి. (వెడతాడు.)

నటాషా—ఈబొామ్మ లెవరివి?...మీా అమ్మాయివా?

బో(బోవు—కాదు నాభార్యవి.

నటాషా—మాపయోనీర్ డివిజన్‌లో చిన్నపిల్లలసహా బొమ్మలతో ఆడుకోరు. పెళ్ళాలమాట అటుంచి ఆశ్చర్యంగావుంది.

(కాస్తాల్‌స్కీని వెంటబెట్టుకొని వాలంటీనా వస్తుంది.)

వాలంటీనా—మిగిలిన కమీాషన్ సభ్యులు ఏరీ?

క్లారా—వాళ్ళు తమరాక రేపటికి వాయిదావేసేరు. కాని, రేపు నేను కంట్రోల్ కమీాషన్‌యొక్క సమావేశానికి వెళ్ళవలసివుంది. అందుచేత ఇప్పుడు వచ్చేను. ఈఅమ్మాయిని కోలాయ్ షెకొవాయ్‌కూతురు.

వాలంటీనా—నికోవాయ్ పెట్రోవిచ్ కూతురా?

క్లారా—ఊం. ఒకేయింట్లో వాళ్ళతోనే వుంటూన్నా. బొమ్మ చూడడానికి తనూవస్తానని కూర్చుంది. పైతెరతీసి, నువ్వు చెక్కినబొమ్మ చూపు.

వాలంటీనా—ఈబొామ్మపేరు '(శామికుడు.' అదిఒకవ్యక్తియొక్క చిత్రంకాదు. ఈ మనయుగంలో మానవజీవితంయొక్క మూలసిద్ధాంతాల మూర్తివంతం. కోపం - (పేమ - బాధ - విజయముల సమ్మేళనం.

నటాషా—మీా రీబొామ్మలతో ఆడుకుంటారా?

వాలంటీనా—కాదు తల్లీ. నేను ఆడుకోను.

నటాషా—అయితే ఇక్కడ ఇన్నిబొమ్మలు ఎందుకువున్నాయి.

వాలంటీనా—నువ్వు ఆడుకుందుకే.

నటాషా—నేను పయొనీర్‌ని. నాకివి ఒద్దు.

(బొమ్మలపక్క బల్లమీాద కూర్చుంటుంది.)

[పెద్దవి(గహం పైనకప్పినదుప్పటీ కాస్తాల్‌స్కీ తొలగిస్తాడు. కండలు - శరీరాలు - ముఖాలూ సుస్పష్టంగా కనిపించే పెద్దమట్టిముద్ద కనబడుతుంది]

వాలంటీనా—అదిగో.

క్లారా—అదా?—ఉహూ.

[క్లారా నిశ్శబ్దంగా ఆవిగ్రహంచుట్టూ ఒకమారు తిరిగి చూస్తుంది. రెండోమాటు తిరిగి పరీక్షిస్తుంది. దూరంగా నిలబడుతుంది. అనిశ్శబ్దాన్ని భంగిస్తుంది నటాషా.]

నటాషా—అత్తయ్యా! ఏమిటిది?... ఒంటా?

క్లారా—నటాషా!

[బోబోరివు పక్కన నవ్వి గదిలోంచి పరుగెత్తిపోతాడు.]

నటాషా—అయితే ఆచిన్న మూపురాలేమిటిమరి?

వాలంటీనా—కండరాలు, అమ్మా!

క్లారా—ఓహో!...(గబగబ అటూయిటూ పచారుచేసి, వాలంటీనా ఎదుట నిలబడుతుంది.) ఎక్కడ నువ్వు చదువుతు?

వాలంటీనా— గవర్నమెంటు షాపులలో పట్టాపుచ్చుకున్నా. ఆరేడు పన్నెండుమందికీ పట్టాలువచ్చాయి.

క్లారా—నీపేరు వాల్యాకాదూ? ఇల్లావిను. వాల్యా! ఈశిల్పకళనిగురించి ప్రత్యేకంగా నాకేమీ తెలియదు...

కాస్టాల్‌స్కీ—అయితే నీవు పరీక్షించడం కూడదు...

క్లారా—(కాస్టాల్‌స్కీతో) మనుష్యుడు పంట్లం తొడుగుతాడు. అంతేకాని పంట్లం అనే భావనని తొడగడు. అసలు వస్తువులేనిదే పంట్లం వచ్చేదెలాగ? ఎప్పుడేనా ఎరుగుదువా పోనీ? సరిగ్గా వాల్యాచేస్తూన్న పని అలాగేవుంది. ఒకభావన ఆకారంలో పెట్టబోయింది. చూచేవా ఫలితం?

కాస్టాల్‌స్కీ—ఇంతవరకు సోషలిజంకూడా నూలులేని బట్టమాదిరిగానేవుంది. అయినా దానిని మనం నిర్మించుకు రావడంలేదూ?

క్లారా—ఈసిద్ధాంతాలు ఎక్కడనేర్చావు నాయనా!

కాస్టాల్‌స్కీ—(చిన్నపోయి) మాకేషన్స్ బుక్కులోవుంది.

క్లారా.—శేషన్ బుక్ చాలా కఠినమైన గ్రంథం. రోజుకో కావ నేనా చదువుతూంటే? ఇంకా ఎక్కువ చదువుతూన్నావా?...(వాలంటీనావైపుతిరిగి) వాల్యా! కళకల్లా ప్రధానం నిరాడంబరత. ఎప్పుడేనా వేసవికాలపు సాయంకాలంపూట షికారువెళ్ళేవా? గడ్డి పచ్చగా, అందంగా, మంచుపదునుతో కనపడుతుంది. అప్పుడే కడిగి అమర్చేరా అన్నట్లువుంటాయి దుబ్బులు. నదిమీదినుంచి పొగమంచు తెరవేస్తూంటుంది. భూమి వెచ్చగా వుంటుంది. అతిప్రశాంతంగా కాలం నడుస్తూంటుంది. ప్రతీదీ అతి సాధారణంగా నిరాడంబరంగా వుంటుంది. ఆ దేవదారువృక్షాలు - పచ్చికబీళ్లు - అడవిపోళ్ళు-గోధుమచేలు. ఆపారిశుధ్యం చూడగానే మనస్సు ప్రశాంతి పొందుతుంది. భావాలు స్పష్టంగా, గంభీరంగా వుంటాయి. వాల్యా అదీవిషయం. మన గ్రామికభవనంకోసం తయారుచేసేవు ఈశిల్పాన్ని. ఆశిల్పం చూడగానే భావాలూ, అభిప్రాయాలూ, గాంభీర్యతని పొందాలి. కాని, దానిబదులు చూడగానే అయిదు నిమిషాలపాటు ఆశ్చర్యంతో స్తంభించిపోయేను. వాల్యా! ఈగూనుగడ్డి పెద్దన్నని వొదిలి మళ్ళీ మొదటినుంచీ ప్రారంభించి క్రొత్తది తయారు చెయ్యమని నాసలహా. నటాషా! పోదాం. రాతల్లీ!

నటాషా—(బొమ్మలహడావిడిలో) అత్తా! మరికాస్త సేపు మాట్లాడరాదూ?

క్లారా—పోదాం.

నటాషా—(ఒకనిట్టూర్పు విడిచి, లేచి) అయితే నడు నాకూ చాలా పనివుంది. శానిటరీ కమీషన్ రిపోర్టు మళ్ళీ వ్రాయవలసివుంది.

(క్లారా, నటాషాలు వెళ్ళిపోతారు. విచారంతోనూ, అవమాన పీడితంగానూ చూస్తూ నిలబడిపోతుంది వాలంటీనా. బోబ్రోవు వస్తాడు.)

బోబ్రోవు—క్షమించు. వాల్యా!

వాలంటీనా—నాదగ్గిరికి రావద్దు. ముట్టుకోవద్దు.

బోబ్రోవు—క్షమించు...అపుకోలేకపోయేను నామాట నమ్మ.

వాలంటీనా—నాదగ్గిరికి రావద్దు. అనవ్వేది ఇప్పుడు నవ్వండి. వాళ్ళకి నాబొమ్మ నచ్చలేదు. (బొరోడిన్ వస్తాడు.) ఇదంతా నీ "చైతన్య శక్తి" మూలంగా వచ్చింది.

బోబ్రోవు—వాల్యా! ఇదిగో!

వాలంటీనా—ఇదిగో, ఏమిటా ఇదిగో? నన్ను చూసినవ్వుతూ... ఇంకా? ఎందు కామనసులోనే కులుకు. అనవ్వేది మొహంమీదనే నవ్వరాదూ? కానీండి... (వెళ్ళిపోతుంది.)

బొరోడిన్—ఏమిటి ఈలాగ తయారవుతూన్నారు? ఏమిటిది?

కాస్టాల్‌స్కీ—ప్రజలు వర్గపోరాటంసాగిస్తున్నారు, ప్రొఫెసర్

బొరోడిన్—ఊరుకో. నీకూ - నాకూ తెలిసింది ఏమీ లేదు. చప్పిదవడల కిరిఘ్లిషియన్లు పండితుల్ని బహిష్కరించడమా? ప్రొఫెసర్లని జైళ్ళలో కూరడమా? తెలివితేటలుగల గ్రాడ్యుయేట్ స్టూడెంట్లని "వైట్ జన్‌టీస్"లు అణిచివెయ్యడమా? ఏమిటీప్రళయం...? ఛుప్! నీకేమీ తెలియదు. తమగతిజీవితం కప్పిపుచ్చుకోడానికి బిడ్డలు తల్లుల్ని దూరం పెడుతూన్నారూ? కూతుళ్లుతండ్రుల్ని తిడుతూన్నారూ? మొట్టమొదట నేప్రేమించిన ఆమె ఈవయస్సులో నాయింటికివచ్చింది. ఏమిటిది...?

కాస్టాల్‌స్కీ—రష్యన్ విద్వాంసుల దుర్గతి!

బొరోడిన్—మతిలేనిమాట! అందరికీ మతిపోయివుండాలి!

కాస్టాల్‌స్కీ—మానవుని ప్రవర్తన పరిశోధించేటందుకు లేబరేటరీ పెట్టాలనే మాకరోవాసూచన అంగీకరించండి! చెవులపిల్లులతో తాపత్రియపడ్డది చాలు. మానవునిలో మతిలేనితనాన్ని ప్రేరేపించే ఆచైతన్యశక్తి ఏదో పరిశోధించి కనిపెట్టాలి.

బొరోడిన్—ఆహా! హా! (నుదురు కొట్టుకుంటూ) భేష్! మంచి మాట! అద్భుతమైన ఆలోచన! ఔను. బాగుంది. ఇంకా సందేహాలేమిటి? మనం వెంటనే మానవప్రవర్తనా పరిశోధనశాల స్థాపించుదాం. వేలకొలది

వ్యక్తుల్ని శాస్త్రీయపద్ధతులమీద, ఖచ్చితంగా, పక్షపాతం లేకుండా, పరిశోధించుదాం. మనజీవితపద్ధతులు మానవజాతికి నాశకరంగా వున్నాయని మనం నిరూపించాలి. మహాప్రళయానికి దారితీస్తున్నాయి. దేశాన్ని నడపవలసింది సైన్టిస్టులుగాని, పైవీజన్టీన్లుగాదు. నేనీవిషయం శాస్త్రీయపద్ధతులమీద నిరూపిస్తాను.

కాస్టాల్‌స్కీ—సోవియట్ పరిపాలనా విధానం ఎందుకూ పనికిరాదని మనలేబరేటరీ నిరూపించాలి. నిజమేనా?

బొరోడిన్—అంతే!

బ్రోబ్రోవు—అదెన్నటికీ జరగదు. హెర్మన్!

కాస్టాల్‌స్కీ—మద్దువుగాని కాదూ!

[తెర.]

రెండో రంగం.

ఎలెనా ఇల్లు. అలంకారాలు అతినిరాడంబరంగా, అవసరమైన వస్తువులు తప్ప వేరేమీ లేవనే చెప్పవచ్చు. ఎలెనా కొంచెం మొరటుగా కనపడే శ్రామికయువతి. బలమైనది. చురుకుగలది. అలంకార శూన్యంగా వున్నా ఆకర్షణీయ. ఆమె భర్త షెకోవాయ్ పొడుగ్గా, ఆకర్షణీయంగా వుంటాడు. శ్రామికవర్గపురుస్తులు, పద్ధతులు అలవడినా, పూర్వకాలపువాసనలు స్పష్టంగా కనిపిస్తూంటాయి. అతని మొదటిభార్య కూతురు నటాషా, బల్లవద్ద కూర్చుని, న్యూస్ పేపరు కటింగ్‌లు అంటించుకుంటూంది. ఎలెనా, క్లారాని గదిలోంచి లాక్కువచ్చి, సోఫాలో కూలవేస్తుంది. షెకోవాయ్ బహుఉత్సాహంలో వున్నాడు.

క్లారా—నాకు చాలా పనుంది...పని...పనుంది!

ఎలెనా—మనం నెగ్గేం... నెగ్గేసేం!

షెకోవాయ్—ఇన్‌స్టిట్యూట్ మన స్వాధీనం అవుతూంది. ప్రవర్తనాపరిశోధనశాల స్థాపించబడింది. నాభార్య - ఎలెనామాకరోవా -

దానిని నడుపుతుంది. కాని, ఆబోబ్రోవు - ఆతడు ఏలాంటివాడంటావు? తాలిముచ్చులావుంటాడు. నెమ్మదిగా బల్లఎక్కి, ఏదో తప్పుపని జరిగిపోతూన్నట్టుగా... "నేను పరిశోధనశాఖాసంచాలకుడిని. ఆ అధికారంతో, మానవప్రవర్తన పరిశోధించే శాల స్థాపించబడటానికి నేను అభ్యంతరపెడుతూన్నా."

ఎలెనా—బొరోడిన్ స్తంభితుడైపోయి, ముక్కచిమ్ములు ఆరంభించేడు. బోబ్రోవు పెంపుడుకుక్క అని నేనెప్పుడూ చెపుతూనేవున్నాను. ఉన్నాడా నోరుమూసుకు వూరుకుంటాడు. లేదా బొరోడిన్‌ని సమర్థిస్తాడు. పెంపుడుకుక్కయినా ఒకమాటు కాకపోతే ఒకమాటయినా కరుస్తుంది కాని—

నటాషా—నాన్నా! ఎలెనా! అంత గోలచేస్తారేమిటి? ఏమీ తోచకుండా.

షెకోవాయ్—ఎంతమంది మధ్యవున్నా పనిచేసుకోనడం అలవాటు చేసుకోవాలమ్మా!

నటాషా—కొద్దికొద్దిగా అలవాటు అవుతూంది.

ఎలెనా—(నటాషాదగ్గిరికి పరుగెత్తి వెళ్ళి, ఆమెని లాగుకొని) ఈ పాటికి పత్రిక కటింగులు కట్టిపెట్టి, కూర్చోరాదూ?

నటాషా—(క్లారాను అనుకరిస్తూ) నాకు పనుంది - పని - పనుంది.

క్లారా—నటాషా! నాకు తాటాకులు కట్టకమ్మా! ... అయితే బొరోడిన్ మానవప్రవర్తనాపరిశోధనశాల స్థాపించేడంటావూ? దీనికో సమేకాదూ, ఎలెనా ఇంతకాలంనుంచీ తల్లక్రిందులవుతూంది? ఇప్పుడు బోబ్రోవు దానికి అభ్యంతరమా?

ఎలెనా—అతగాడేమీ చెయ్యలేములే. దానికోసం అప్పుడే ఏర్పాట్లు జరిగిపోతూన్నాయి. విచారణసంఘాలుఏర్పాటుచేసి వేస్తూన్నాం. బోబ్రోవుని ఇందులో వేలుపెట్టనియ్యం... ఏం, ఏమిటీ మాట్లాడవేం, క్లారా? మేంచేసింది మంచిపని కాదంటావా? ఏమంటావు?

షెకోవాయ్—ఎలెనా మంచి అదృష్టవంతురాలు. ఇక్కడికి మూడేళ్ళనుంచి, చెవుఁపిల్లుల 'చైతన్యశక్తి' కనిపెట్టే పనిలోవున్నాను. నాలో ఎదుగూ పొదుగూలేదు. సాంఘికవ్యవస్థల్ని గూర్చి చదవడం ఆరంభించి ఇంకా ఏడాదికాలేదు. అప్పుడే రీసెర్చి అసిస్టెంటూ, స్వంతలేబరేటరీ సంపాదించింది.

ఎలెనా—నావేపుచూడు. కొద్దిరోజుల్లోనే బోబ్రోవు స్థానం ఆక్రమించి తీరుతా. అప్పుడు నువ్వే నాక్రింద విద్యార్థివిగా వుంటావు.

షెకోవాయ్—నువ్వెన్నడూ చెప్ప...

ఎలెనా—కాని, మొట్టమొదట అంతా నవ్వినవారే. ఈపని జరుగుతుందని ఎవ్వరికీ నమ్మకంలేదు. రాజకీయాలు శారీరక శాస్త్రసూత్రాల్ని నియమించలేదని వారందరిపూహా. నియమించగలవని మనం చూపించాలి. మనరాజకీయాలు ప్రజల్నే మారుస్తాయి. సహజములయిన భావాలని అంతా తెలచేది ఈనాడు అదృశ్యం అవుతూన్నాయి. అసూయ, అనుమానం, కోపం, భయం, అంతరించిపోతూన్నాయి. సమిష్టివిధానం, ఉత్సాహం, జీవితానందం, అభివృద్ధిపొందుతూన్నాయి. ఈనూతనచైతన్యశక్తులు అభివృద్ధిపొందేటందుకు మనం సాయపడతాం.

క్లారా—లేబరేటరీలలో మానవుని ప్రవర్తనని తయారుచేయగల రోజువచ్చిందని చెప్పుదూ. అది గొప్పమాటే. పూర్వకాలంలో మనం మంచిప్రవర్తన జైళ్లలోనూ, ప్రవాసాలలోను, పార్టీపనిలోనూ, నేర్చుకున్నాం. కాని, మాపడుచువాళ్ళు ఇప్పుడు ఏదికావలసినా పొందగలుగుతూన్నారు.

ఎలెనా—లేబరేటరీయే పార్టీ లోకల్ అవుతుంది.

(వాలంటీనా వస్తుంది.)

క్లారా—వాల్యా వచ్చిందే! హలో! వాల్యా!

వాలంటీనా—క్మామేడ్ క్లారా! క్రిందటిమారు నువ్వు చెప్పినసంగతులన్నీ బాగా ఆలోచించాను. ఫ్యాక్టరీలో ఏదేనా పనిసంపాదించుకోవాలని

నావ్యూహం. నన్ను పూర్తిగా మార్చివేసుకోవాలని నాసంకల్పం...కొత్తమనిషిని అయిపోవాలి. యంత్రాలు తయారుచేయబడినట్లే, ఇప్పుడు నాలోంచి కొత్తమనిషిని తయారుచెయ్యాలి. నా కాసాయంచెయ్యి. నన్ను తయారుచెయ్యి.

క్లారా—అయితే ఒక మరనాగలి కాదలచుకున్నా వన్నమాట. అంతేనా...సరే మాట్లాడుకుందాం. రా. మాట్రాక్టరు పెదవులు బాగా ఎర్రగావున్నాయేం? మొహం కొంచెం వాడినట్లుంది. కాని, నీముఖం స్వభావసిద్ధంగా అందమైనదే...రా వెడదాం.

(వాలంటీనా, క్లారాలు వెడతారు.)

షెకోవాయ్—(ఒక్కక్షణం ఆగి) చాలా అందమైనముఖం... మంచిశిల్పి?

ఎలెనా—ఆమె వొక పాలిషెసురుకూతురు. చేసేపనిలేక మన్ను పాలుచేస్తూ కూర్చుంటుంది.

షెకోవాయ్—ఆవిడ పనిమానేసు...అయినా ఇప్పుడు పూర్తిగా మారడానికే ప్రయత్నిస్తూందిగదా?

ఎలెనా—అనుకుంటూంది అంతే.

షెకోవాయ్—ఫ్యాక్టరీలలో మనుష్యులు మారడానికి వీలు లేదంటావా?

ఎలెనా—మనుష్యుల్ని మార్చడం అంటే, ట్రాక్టరు రిపేరు చేయడం అనుకుంటున్నావా? ఒకపెద్దమనిషి మెకానిస్టు బల్లవద్ద కూర్చున్నంత మాత్రాన శ్రామికుడైపోతాడా?

షెకోవాయ్—అయితే నీమాట ఏమిటి?...అతగాడు మాలేబరేటరీలో కొత్తగ్లాండ్లు అమర్చించుకోవాలంటావా? దీనికేం అర్థంలేదు. ఫ్యాక్టరీ కమ్యూనిస్టు విద్యాలయం.

ఎలెనా—అదొక సాధారణనినాదం. దానిపేరుచెబితే నాకు తల నొప్పి.

షెకోవాయ్—అతివాదధోరణిలో పడిపోతూన్నారని ఇంకా అన లేదేం. కానీ,

నటాషా—నాన్నా! అతివాదధోరణి ప్రమాదకరమా? మితవాద ధోరణా?

షెకోవాయ్—ఊరుకో.

నటాషా—ఈ రెండింటికన్నా మోసకారితనం ప్రమాదకరమని నా వూహ.

షెకోవాయి—చాలులే వూరుకో.

(బోబ్రోవు వస్తాడు. ఓవర్‌కోటు ఒకటి తొడిగేడు. టోపీ చేత పట్టుకొని వున్నాడు.)

నటాషా—దానిమీద నేనిప్పుడు రిపోర్టు వ్రాస్తూండగా, ఊరుకో మంటా వేమిటి?

బోబ్రోవు—వాలంటీనా బొచ్చుకోటు ఇక్కడవుందే.

ఎలెనా—ఆమె క్లాగాస్టాసోవాని చూడటానికి వచ్చింది. అల్లా వెళ్ళవచ్చును.

బోబ్రోవు—ఎలెనా! నీతో మాటలాడడానికే వచ్చేను. లేబరేటరీ విషయంలో తొందరపడవద్దని ఒకసారి తిరిగి హెచ్చరించడానికి వచ్చేను. ప్రతివిషయం జాగ్రత్తగా ఆలోచించు. మంచిచెడ్డలు సరిచూడు. బోర్డు డిన్ యొక్క ప్రతిసూచనా బాగా ఆలోచించు. కంగారుపడి నిర్ణయాలకి రావద్దు. ఇటువంటి విషయాలలో కంగారు పనికిరాదు.

ఎలెనా—ఈపరీక్షలతో ఎన్నేళ్లు గడపటం?

బోబ్రోవు—నేను భవిష్యత్తు చెప్పలేను.

ఎలెనా—నేచెప్తా విను. ఆదర్శవాదులయిన మీబోట్లు ఒక్క ఏడాదిలోకాని చెయ్యలేనిపని, మామార్క్సిస్టులూ - బోల్షెవిక్కులూ ఒక్క నెలలో చేసెయ్యగలం.

షెకోవాయ్—రాజకీయాలలో, అతి ఆలోచనని 'అపర్చ్యూనిజం' అంటారు.

బోబ్రోవు—నాకు రాజకీయాలతో పనిలేదు.

షెకోవాయ్—అంటే సైన్సుకీ - రాజకీయాలకీ సంబంధం లేదని చెప్పబోతూన్నావా? ఈనినాదం బయలుదేరతీస్తూన్న జనం ఏలాంటివారో మాకు తెలుసును. కాస్టాల్‌స్కీ చెప్పినట్లు ఈలేబరేటరీ రాజకీయాలకి సహాయంచెయ్యడానికి ఏర్పరచేరని చెప్పవుకద?

బోబ్రోవు—కాస్టాల్‌స్కీపద్ధతి అంతా వేరు - మన కేదో పేరు పెట్టడమే అతగాడిపని.

షెకోవాయ్—నికోలాయ్! మోసంవిషయమై చెప్పవస్తే ముందు నీభార్యవిషయం చూసుకో.

బోబ్రోవు—చాలా మోటగా మాట్లాడుతూన్నావు.

షెకోవాయ్—క్షమించు. ఇది శ్రామికులపద్ధతి.

ఎలెనా—నికోలాయ్! నీమాటలకి అర్థంలేదు.

నటాషా—నాన్నా! ఆరుఏళ్ళు ముప్పైరోజులా? నలభైయెనిమిదా?

షెకోవాయ్—ఎలెనాని అడుగు. ఆమె మంచి తెలివిగలది. మీనాన్న పట్టిగ్రాడ్యుయేట్ స్టూడెంటే కాదూ? (క్లారా తలుపుతట్టుతాడు.) నేను లోనికి రావచ్చా? (వెడతాడు.)

ఎలెనా—ఆమాట నిజమే!... (నటాషాతో) ఆరుఏళ్ళు నలభై రెండు. (బోబ్రోవుతో) రాతివిగ్రహంలా నిల్చుంటావెందుకు, కూర్చో.

బోబ్రోవు—ఇతరుల ఇళ్ళకద్ద నేనంత చనువుగా వుండలేను... అయితే నాసలహా అంగీకరించనట్లేనా? వెళ్ళిపోయేదా?

ఎలెనా—నికోలాయ్ కాశ్యానోవిచ్! నెల్లాళ్ళపాటు దేశంఅంతా చుట్టి, చూసివచ్చేవు. ఇప్పటికీ ఇంకా రాజకీయాలకీ, విజ్ఞానశాస్త్రాలకీ సంబంధం లేదనే చెప్పుతూన్నావంటే, ఏమీచూడలేకపోయావనీ, అర్థం చేసుకోలేకపోయావని చెప్పాలి.

బోబ్రోవు—కాదు. నేను ఎన్నో విషయాలు చూడగలిగేను. చూసినవన్నీ ఇంతవరకూ జాగ్రత్తగా ఆలోచిస్తూన్నాను. ఈ దేశాన్ని ఇప్పుడు పాలించుతూన్నది, రాజకీయవేత్తలు. రాజకీయవేత్తలు వర్తమానయుగంలోనే తమదృష్టివుంచుతారు. కాని, వైజ్ఞానికుడు వందలకొలది సంవత్సరాలు దృష్టిలోవుంచుకోవాలి. ఎంత శ్రేష్ఠమైన రాజకీయాలే కానియ్యండి, కొన్ని కొన్ని విషయాలలో డబ్బు ఖర్చుపెటినట్లు ధారాళంగా ఖర్చుచేస్తుంది. కాలాన్ని చూడు; 'జైంట్' ప్రభుత్వపొరం చల్లికలు మునుముందు పూర్తి చెయ్యాలనీ, పుట్టిలోల్ ఫ్యాక్టరీ తన అంచనాలని అనుకున్న కాలానికి ముందుగనే పూర్తి చెయ్యాలనీ మీరెరుగుదురు. లోకల్ కమిటీలకి రేపు ఎలక్షన్లు జరుగుతాయని మీకు జ్ఞాపకమే. బార్లీరేషన్ పద్ధతిలో పంచుతూన్నారని మీకు గుర్తే. కాని 'ఫాస్టు' వ్రాసిన వారెవ్వరో మీకు జ్ఞాపకం వుండదు.

ఎలెనా—ఆ నాటకం నేనెన్నడూ చూడలేదు.

బోబ్రోవు—అది చూసేదికాదు. చదవవలసిన పుస్తకం. చీనా గిన్నెకీ-సాక్షన్ గిన్నెకీ భేదం మీకు తెలియదు.

ఎలెనా—మేం గ్లాసులతో తాగుతాం.

బోబ్రోవు—అనాగరికప్రజలలోనుంచి చరిత్ర మనల్ని నాగరిక ప్రజల్నిగా మార్చింది. కాని, మీ రాజకీయవేత్తలు సమిష్టిత్వం అనే అమూందస్తాలో ఒక్కమాటుగా ఆ భేదాల్ని దంచెయ్యాలని ప్రయత్నించుతూన్నారు.

ఎలెనా—మేము చరిత్రని సృష్టించుతూన్నాం. నీవు జీవితసత్యం గ్రహించి దానిలో పాల్గొనేవుండివుంటే మాపని వట్టినే భేదాలు నశింపచెయ్యడంమాత్రమే కాదని గ్రహించి వుండేవాడివి. (తలుపుచప్పుడు) క్షమించు. ఇప్పుడే వస్తూన్నా. (వెళుతుంది.)

నటాషా—(ఇంతసేపూ బోబ్రోవువంక శ్రద్ధగా చూస్తుంది.) మీ వద్ద చాలాకుండేళ్ళు వున్నాయా? ఓ వందయినా వుంటాయనుకుంటా.

బోబ్రోవు—ఓమాటు వచ్చి నువ్వే చూసుకోకూడదు? మావద్ద చాలా అందమైన చెవులపిల్లులున్నాయి.

నటాషా—నాకొక్కటా పని? ఎక్కడా ఖాళీలేదు. పంచవర్ష ప్రణాళిక రిపోర్టు వ్రాసుకుంటున్నా ఇప్పుడు. (బోబ్రోవు చిరునవ్వు నవ్వడం గ్రహించింది) నవ్వకు. మన్నుతో ఒంటెలు చెయ్యడంకంటె ఇది కష్టమైన పనే.

బోబ్రోవు—ఎక్కడ చదువుతావమ్మా ఈరిపోర్టు!

నటాషా—మాస్కూలుక్లబ్బులో, నేను స్కూలులో రిపోర్టరుగా నియమించబడ్డా.

బోబ్రోవు—మీస్కూలులో క్లబ్బు సరదాగా వుంటుందా?

నటాషా—నాతోవస్తే చూద్దురుగాని కాదూ? నే తీసుకువెడతా. చాలాబాగుంటుంది. నాన్ననీ, ఎలెనానీ ఎన్నోమాట్లు రమ్మన్నాను. కాని, పనులుమూలంగా రాలేకపోయేరు. చాలా సరదాగా వుంటుంది. నిన్ననే మాకో కొత్తపాట చెప్పేరు. బాగుంటుంది. చెప్తాను పాడతారా?

(ఆమె పయోనీర్ మార్చింగ్‌సాంగ్ ఒకటి పాడుతుంది. క్లారాగది గుమ్మంలోంచి వాలంటీనా తొంగిచూస్తుంది. బోబ్రోవును పలకరిస్తుంది.)

వాలంటీనా—కోల్యా! నేవచ్చేవరకూ ఆగుతారా? (మళ్లీ వెళ్ళిపోతుంది.)

బోబ్రోవు—చాలాబాగావుంది.

నటాషా—ఏమిటాబాగున్నది?...మనం వెళ్ళడంమాటయేమిటి?

బోబ్రోవు—రాలేను తల్లీ!

నటాషా—మీరూ అంతేమాటా? అసలు మీకు జీవితసత్యం తెలిసి దానిని అనుభవించగలుగుతే...!

(మూసిన తలుపువెనకనుంచి పకపక నవ్వు)

బోబ్రోవు...సరే. వస్తానులే.

నటాషా—భేష్! (చొక్కాపట్టుకులాగుతూ) అయితే నడవండి. మళ్ళ వద్దంటారుగనక!

(బయటకు పరుగెత్తి వెడుతుంది. ఎలెనా వస్తుంది.)

ఎలెనా—కాస్టాల్‌స్కీ ఇప్పుడే ఫోన్ చేసేడు. వాళ్లు ఆరువిచారణసంఘాలని తయారుచేసేరట. ఈపాతబండి (ఇన్‌స్టిట్యూట్) ఏలాగైతేనేం ప్రయాణం మొదలు పెట్టింది, మాచిన్నవైజ్ఞానిక విద్యాలయం, యుద్ధకాలపువేగాన్ని అందుకుంది. చూస్తుండు. రెండేళ్ళల్లో ఈచిన్నయింటి నుంచి అరంతస్థుల మేడకి మారుస్తాం...హుఁ.

బోబ్రోవు—ఎలెనా! మీమానవప్రవర్తనా పరిశోధనశాలనిగూర్చి నాకు తెలిసినవిషయాలు నీకు చెప్పడానికి వీలులేదు. అది కుటుంబమర్యాద. కాని, మళ్ళీమళ్ళీ చెప్తున్నా. జాగ్రత్తగావుండు. ప్రమాదకరమైన వ్యవహారంలో చిక్కుకుంటున్నాం. (బయలుదేరేడు.)

ఏలెనా—తరువాత కలుసుకుందాం.

(వీధిలోకి పోయేటందుకు దుస్తులు వేసుకుని నటాషావస్తుంది. ఆమె చేతిలో బోబ్రోవు 'ఓవర్ షూ' లు వున్నాయి.)

నటాషా—వెడదాం రండి. నేను తయారు.

(బోబ్రోవు నటాషాతో వెడతాడు.)

ఎలెనా—ఇంత పట్టుదలగా వ్యతిరేకించుతూన్నాడేం చెప్మా. ఏమిటో ఆకుటుంబమర్యాదలు? అల్లా అనడంలో వుద్దేశ్యం ఏమిటి?

(క్లారా గదివద్దకు వస్తుంది. షెకోవాయ్ పకపకనవ్వూ, వాలంటీనా గొంతుక, వినబడి అంతలో అభిప్రాయం మార్చుకుని, బల్లవద్ద కూర్చుండి, బ్రీఫ్‌కేసు దులుపుతుంది.) ప్రస్తుత రాజకీయాల క్లాసుకి వెళ్ళలేకపోయేను. పార్టీలోకల్‌లో మళ్ళీ పీకిమీదికివస్తుంది.

(షెకోవాయ్, క్లారా, వాలంటీనాలువస్తారు.)

వాలంటీనా—నికోలాయ్ పెట్రోవిచ్! "శ్రామికవైజ్ఞానికుడు" అనే శిల్పానికి నువ్వు "మోడల్"గా వుంటే చాలా బాగుంటుంది. నీవు పూర్తిగా ఫ్యాక్టరీ తయారీ. నీఆత్మవిశ్వాసం - నీపద్ధతి - నీకంఠం... అంతా...ఒకప్పుడు గ్రీకులు తమ సౌందర్యదేవతా ప్రతిమల్ని అవిసె

నూనెలో ఉడకపెట్టేవారట, ఆ చలవరాయిలో వేడిపుట్టి, సజీవంగా కన పడటానికి కాని, మనం, ఇప్పుడు మన విగ్రహాల్ని మిషన్ నూనెలో కాచాలి! కార్ఖానా పొగలలోనూ, మానవుల చెమటలోనూ, నానవె య్యాలి. అప్పుడు వస్తుంది వాటికి జీవకళ.

క్లారా— చెమటలు కక్కుతూ, జిడ్డులోడుతూన్నవారు. పరిశుభ్రం గా వుండడానికంటూ, మేము స్నానశాలలు కట్టించుతుంటేనా?

వాలంటీనా—త్వరగా ఫ్యాక్టరీకి పోదాం. నేను అన్నివిషయాలూ, ముట్టుకుచూడాలి. శాశ్వతమైన విషయాలు గమనించాలి. నేను ఆద్యంతం పూర్తిగా మారిపోవాలి... కాని, ఏరీ నాభర్త?

ఎలెనా—మీభర్త వటూపాతో క్లబ్బుకి వెళ్ళేడు.

వాలంటీనా—ఒక్కర్తినీ వెళ్ళడం ఎట్లా?

షెకోవా—ఈకూలివాడే రావలసివుంటుంది.

వాలంటీనా—(చేయిఇస్తు) సెలవు.

ఎలెనా—(ఖండితంగా) తరవాత కలుసుకుందాం.

షెకోవాయ్—(వాలంటీనాను గుమ్మంవరకూ పంపి, తిరిగివచ్చి) ఇంతకంటె కొంచెం మర్యాదగా వుండలేవూ?

ఎలెనా—క్షమించు. ఇది శ్రామికపద్ధతి.

షెకోవాయ్—ఇదిగో నీకు జాబువచ్చింది. (ఒకఉత్తరం బల్లపై పడేస్తాడు) అదిగో. (వెడతాడు.)

క్లారా—ఆమె నీమనస్సుకి నచ్చలేదనుకుంటా. నాకు ఆమెలో లోపం కనపడలేదు. ఫ్యాక్టరీలో ప్రవేశపెడదామనుకుంటున్నా.

ఎలెనా—ఎందుకు పనికిరాని పనులు నెత్తినపెట్టుకుని సతమతం అవుతూంటావు.

క్లారా—మీపడుచువాళ్లది ఎప్పుడూ ఒక్కటేచూపు. లేబరేటరీకి పనికివస్తారా, రారా? అంతేకాని, మేము ప్రజల్ని వదిలిపెట్టలేము. చచ్చి నాసరే.

ఎలెనా—(చదువుముగించి) మొన్న అరస్టుచేయబడిన కోటోమిన్ శిష్యుడు కాదూ బోబ్రోవు? నువ్వెరుగుదువా?

క్లారా—అయితే ఏమిటి?

ఎలెనా—ఏమిటేమిటి? మతిలేదా? ఒకవిధ్వంసకారిశిష్యుడు... మన ఇన్‌స్టిట్యూట్‌లోవున్నాడు.

క్లారా—అయితే అతడుకూడా విధ్వంసకారి కావాలనివుందా?

ఎలెనా—నన్ను కాస్త ఆలోచించుకోనియ్యి! (చాలా విసువుగా వుంటుంది. గదిలో పచారు ప్రారంభిస్తుంది.)

క్లారా—ఏమిటాఆలోచన? ఈవేళ నువ్వు చాలా తప్పుదారి తొక్కుతూన్నావు. ఏమిటాచేతులు ఆలాగతిప్పుతావు? ఎందుకంత బెదురు! ఊరూ పేరూలేని ఆఆకాశరామన్నవుత్తరం చూసేనా?...ఆలోచించు!...

ఎలెనా—మంచిచదువుకున్నవ్యక్తి!....చీనాపింగాణీ...! వందల కొలది ఏళ్ళు! బాగుబాగు...! (వెంకెతనంగా) నువ్వు లేబరేటరీ నిర్మాణానికి ఎదురెత్తుగా నిలబడితే, నేనది స్థాపించి నడిపించేటట్లు చూస్తా.

[తెర]



# రెండో అంకం

## మూడో రంగం

(ఇన్‌స్టిట్యూట్ లైబ్రరీలో, ఎడమవేపున బోరోడిన్ చదువుల గదికి ద్వారం వుంది. కుడివైపు గుమ్మం ఇన్‌స్టిట్యూట్‌లో పనిచేసేవారు వచ్చిపోవడానికి...

తెర లేచేటంతకి జఖారోవు నల్లబల్లమీద వ్రాస్తూ కనబడతాడు. ఏదో సమీకరణాలు గీస్తూ, లెక్కలు వేస్తున్నాడు. కింబయీవు పుస్తకాలలో పడి వెతుకుతున్నాడు.)

కింబయీవు—నిద్రకీ - తిండికీ ఇంతసేపు వ్యర్థం చెయ్యడం ఏమీ బాగాలేదు. నిన్నరాత్రి నిద్రపోకుండా చదవగలిగేను...ఇంకో పుస్తకం చదివెయ్యగలిగేను...ఇప్పుడు మూడుపుస్తకాలు ఒకేమారు ప్రారంభించేను. యుద్ధమూ - శాంతి; పెట్టుబడిదారీవిధానపు అభివృద్ధి; మనస్సు ఏలా పని చేస్తుంది? కోటోమిన్ పుస్తకాలు ఏమేనా ఇల్లాఇయ్యండి. ఆవిధ్వంసకారుని పుస్తకాలమీద ఏదేనా విమర్శవ్రాస్తాను. కోటోమిన్ పుస్తకం ఈలా ఇయ్యండి!

(కాస్టాల్‌స్కీ వస్తాడు.)

జఖారోవు—అలాగే. (పుస్తకంకోసం షెల్ఫులో చూస్తాడు.)

కింబయీవు—కళ్ళల్లో ఇసకపోసినట్లుంది. రాత్రి తెల్లవార్లూ మేలుకునేవున్నా. స్ట్రాంగ్ టీ తీసుకుంటే ఎంత సేపేనా మేలుకో వచ్చును.

జఖారోవు—బోధిధర్మ తత్త్వవేత్త నిద్రపోకుండా వుండడానికై కనురెప్పలు కోసేసుకున్నాడు. వాటిలోంచే తేయాకు మొక్క పుట్టింది. అందుచేతనే టీ నిద్రరాకుండా చేస్తుంది.

కింబయీవు—వట్టి కట్టుకథ...నాకు తల నొప్పిగావుంది.

కాస్ట్రాల్‌స్కీ—రాత్రి అనేది నిద్రకోసమే ఏర్పడింది. (హేళనగా) మేం నెలల తరబడి నిద్రలులేకుండా చటవేమంటే అది సీకు సాగదు. బాగా అనాగరిక జాతివాడివి. నిద్రలేకుంటే నీకు ప్రమాదిస్తుంది.

కింబయిూవు—అది మాకు ప్రమాదకరమా? మీరు కామా? మీరు గొప్పవాళ్ళా. మేము చిన్నలమూనా? చిన్నవాళ్ళు చంటిబిడ్డలమాదిరిగా పెందరాళే నిద్రపోవాలీ? కామ్రేడ్ కాస్ట్రాల్‌స్కీ! ఇదివరకు నిద్రపోయేం. చాలు. ఆరోజులుకావు ఇప్పుడు. నువ్వుచెయ్యగలపనికి రెట్టింపు పని చెయ్యగలను, నువ్వు ఒక్క నెలరోజులు నిద్రలేకుండా వుండగలుగుతే, మేను రెండు నెలలపాటు వుండగలం. నేను కాస్ట్రాల్‌స్కీని ఏవిధంగానైనాసరే అందుకు తీరుతా.

కాస్ట్రాల్‌స్కీ—కానీ...కానీ...కింబయిూవ్! త్వరపడు.

కింబయిూవు—ఆమాత్రం నాకూ తెలుసును. (బొరోడిన్, ఎలెనాలు వస్తారు)

ఎలెనా—మన మానవ ప్రవర్తనా పరిశోధనశాలవాళ్ళు, పాలు అమ్మకొనేవాళ్ళనీ; బహిష్కరించబడిన పుస్తకవిక్రేతలనీ; దివాలాతీసిన వాళ్ళనీ పరీక్షిస్తూన్నారు. ఆమాదిరి సాంఘిక శాఖల్ని పరీక్షించడంలో వుద్దేశం ఏమిటో నాకు అర్థంకావడం లేదు.

బొరోడిన్—మేము పరీక్షించేది వ్యక్తుల్ని, సాంఘిక శాఖల్ని కాదు.

ఎలెనా—ఎంతోమంది ఫ్యాక్టరీలలో పనిచేస్తూన్నారు కదా వారిని?

బొరోడిన్—విజ్ఞానశాస్త్రదృష్ట్యా పాలు అమ్మకునేదానికీ ఫ్యాక్టరీ మెకానిక్‌కీ భేదంలేదు.

ఎలెనా—మాదృక్పథంలో ఫ్యాక్టరీ మెకానిక్‌లో ప్రత్యేకతవుంది.

బొరోడిన్—మీదృక్పథం, మీ అవసరం నాకు అర్థంకాదు. మీ పడుచువాళ్ళు యథార్థవిషయాలవేపు చూపు తిప్పరు. మీ అవసరం తప్ప మరొకటి కనపడదు. విజ్ఞాన శాస్త్రాలు ఈ అవసరాలని పరిశీలించదు,

ఎలెనా—మనం వాస్తవికవిషయాల్ని ఏల ప్రోగుచేస్తూన్నామో తెలిసి చెయ్యాలి. కాని, ఇప్పుడు కట్టి గుడ్డిగా పనిచేస్తూన్నాం.

బొరోడిన్...మన అందరిలోనూ, కొద్ది - గొప్ప గుడ్డితనం వుంది.

జఖారోవు—క్యానూన్ దానధర్మాలమూర్తిమంతం. ఆమె ప్రతిమ నావద్దనుంది. ఇస్తాతీసుకో.

అమాలియా—ఈవిడ ఎవరు?

జఖారోవు—నికోలాయ్ పెట్రోవిచ్ భార్య.

అమాలియా—ఓహో! రీసెర్చి అసిస్టెంటు కాదూ?

(ఎలెనావద్దకు వెళ్లి, పరీక్షించి చూస్తుంది. మళ్ళీ వెనక్కి వచ్చి) ఏమేనా పిల్లలా?

జఖారోవు—మొదటిపెళ్ళానికి ఓఆడపిల్ల.

అమాలియా—నటాషా?

నటాషా—ఇక్కడ.

అమాలియా—ఓహో! (బెదిరిపోయినట్లు తిరిగిచూస్తుంది.) నటాషా! పటికిబెల్లంముక్క తింటావా? (జేబుతడిమి ఓముక్క నటాషాకి ఇయ్యబోతుంది.)

నటాషా—నాకొద్దు. ఛా. బాడీగావుంది. ఏమిటి అస్తమానం నములుతూనేవుంటావు?

ఎలెనా—నటాషా! చాలించు!

నటాషా—ఏమిటి అన్నింటికీ అడ్డంవస్తావు? ఆవిడ అస్తమానం ఏదో నములుతూండడం కనపడలేదూ? స్కూలులో 'సెర్గీ' కూడా ఇంతే. నేబడికి పోతానమ్మా! (వెడుతుంది.)

అమాలియా—నటాషా! ... (గొణుగుకుంటుంది.) (కాస్టాల్‌స్కీ వస్తాడు.)

జఖారోవు—(అమాలియాతో) ఆత డాగదిలో వున్నాడు. (చేతిలో ఒకపుస్తకం పట్టుకుని కాస్టాల్‌స్కీవద్దకుపోయి నెమ్మదిగా) గ్రంథకర్త చేవ్రాలుతోవుందని ఈపుస్తకం యివ్వలేదు.

కాస్టాల్‌స్కీ—(పుస్తకం తీసుకొని, చదివి) మంచిపనిచేసేవు. ఈచేవ్రాలుచూస్తే నికోలాయ్ కాశ్యానోవిచ్ పీకమీదికి వస్తుంది.

(తనగదికి వెడుతూ వర్గాసోవు వస్తాడు.)

కాస్టాల్‌స్కీ—సెమియాన్! ఇల్లాచూడు. ఈపుస్తకం ఎవ్వరికీ కనబడకుండా దాచెయ్యి. (పుస్తకం వర్గాసోవుకి ఇస్తాడు. ఆతడు దానిలోని సంతకంచూసి కంగారుగా తీసుకుపోతాడు. కాస్టాల్‌స్కీ ఎలెనా వద్దకు వస్తాడు.) అయిదేళ్ళ వయస్సులోవుండగా మాతోటలో తిరుగుతూంటే వజ్రంపొదిగిన దుద్దు ఒకటి దొరికింది. అప్పటినుంచీ అందరూ నేను అదృష్టవంతుణ్ణి అంటారు. కాని, నాఅదృష్టం సంపూర్ణంకాదు. సగం అదృష్టవంతుణ్ణిమాత్రమే నేను. ఆజతదుద్దు ఎన్నడూ దొరకలేదు... బహుశా బెర్లిన్‌లో దొరుకుతుందనుకున్నా. కాని నాప్రయాణం ఆగిపోయిందికదా? నువ్వు నక్కని తొక్కి పుట్టేవు. శ్రామికవర్గంలో పుట్టడం నీఅదృష్టం!

ఎలెనా—విదేశాలకి పోవడానికి అంత అటమటించిపోతున్నావేం.

కాస్టాల్‌స్కీ—మారిస్ కేవలయర్ పాటలువిని, ఆమూడువందల నగ్నస్త్రీల నాట్యంచూడాలని.

(కింబయీవు, బోబోర్రివులు వస్తారు.

ఎలెనా—నేనీపద్ధతి అంగీకరించను.

బొరోడిన్—అయితే తప్పుకో. కాస్టాల్‌స్కీ చూసుకుంటాడు. ఆతడు నేను చూపినదారిని నడుస్తాడు.

కింబయీావు—కామేమ్రిడ్ బొరోడిన్! ఆత్మవిమర్శనకి తావులేదా?

బొరోడిన్—నీఇష్టంవచ్చినంత ఆత్మవిమర్శన చేసుకో. నన్నుమాత్రంముట్టుకోబోకు.

కింబయీావు—ఎందుకు ముట్టుకోకూడదేం? ఆఖరుకి బద్దలయిపోయే గాజుగ్లాసులుమాత్రం ముట్టుకోకుండా వుంటామా?

[నటాషా వస్తుంది.]

బొరోడిన్—ఎవరీపిల్ల? ఏంకావాలిఅమ్మా!

నటాషా—ఎస్కర్షన్‌కి మాక్లాసుపిల్లల్ని తీసుకువచ్చేను. మీరు పెంచే కుందేళ్ళని చూడటానికి వచ్చేం.

బొరోడిన్...ఇక్కడికి ఎస్కర్షన్లు ఏమీ పనికిరావు...హెర్మన్!

(కాస్టాల్‌స్కీతో తనగదిలోకి వెళ్ళిపోతాడు.)

ఎలెనా—ఏమిటి నటాషా! ఇదేం మ్యూజియమా?

నటాషా—బోబ్రోవు రమ్మన్నారు...మొదట్లో ఆయనే పిలిచేరు. ఇప్పుడీ పేచీ...

కింబయీావు—అంతమాత్రానికి కుందేళ్ళు చచ్చిపోవు. మీవాళ్ళని లోపలికి తీసుకెళ్లు, నటాషా!

ఎలెనా—ఇన్‌స్టిట్యూట్ డైరెక్టరులా మాట్లాడుతున్నావే. ఇదెప్పటినుంచి.

కింబయీావు—మొదట నాకే ఇస్తానంటే, నేను వొద్దన్నాను. కావలసివస్తే బొబ్రోవుని అడుగు. కూర్చో, నటాషా! (జఖారోవుతో) కోటోమిన్ దొరికిందా?

జఖారోవు—(ఒకపుస్తకం తీసి, అట్టలోపలచదివి మూసిపెట్టేస్తాడు.) ఇన్‌స్టిట్యూట్‌లో కోటోమిన్‌పుస్తకాలు ఏవీ లేవు.

కింబయీావు—ఈవేళ లేకపోతేపోయిరి. రేపటికేనా తెచ్చియివ్వాలి. పాతదికావాలి. తెలిసిందా? (వెడతాడు.)

నటాషా—ఈముసిలివాడిమీద గోడపత్రికకి వ్యాసం వ్రాస్తాను.

ఎలెనా—ఏమిటి? ఔను. ఔను. ప్రొఫెసర్ బొరోడిన్. యుద్ధం యుద్ధమే! ఈవిషయం ఏదో ప్రెస్‌లో చర్చించుకుందాం. (బల్లవద్ద కూర్చుండి వ్రాస్తుంది.)

నటాషా—నాకు ఒకపెన్సిలు ఇయ్యి. (వ్రాస్తుంది. అమాలియా వస్తుంది.)

అమాలియా—నీకూ, ఇవాన్‌కీ భోజనం పట్టుకువచ్చేను.

కింబయీావు—కానీ, అమెతో మాట్లాడేది మాట్లాడు.

బోబ్రోవు—(ఎలెనాతో) నువ్వూ, బొరోడినూ మాట్లాడుకున్న విషయాలు ఇప్పుడే చెప్పేడు కింబయీావు. వాళ్ళు నీకళ్ళకి గంతలు కట్టి, చేయిపట్టుకుని నడిపిస్తూన్నారు. నువ్వు వాదిస్తూన్నావు. అభ్యంతరాలు చెప్తూన్నావు. కాని, ఆదారి వదలడంలేదు. ఇప్పటికే వేళమించింది, ఎలెనా. ఈపాటికి ఈవాదనల ఫలితంగా నువ్వు ఒక నిర్ణయానికి వచ్చి వుండవలసిందే.

కాస్టాల్‌స్కీ—అంటే మాకరోవాని నువ్వు చెప్పిన మాదిరిగా చెయ్యమంటావు! పార్టీవాడు కాని ప్రొఫెసరు పార్టీ సూచనలు ఇస్తూన్నాడే!

కింబయీావు—ఈ 'కాజక్' తనని ఎక్కడ అందుకుంటాడోనని పాపం కాస్టాల్‌స్కీ మహాభయపడుతున్నాడు. 'రాత్రిళ్ళు చదవకు. పగలు ఆడుకో' _ అని ఆతని సలహా. ఎలెనా! బోబ్రోవు చెప్పిన మాట విను. ఆతడు నీ మంచికే చెప్పుతున్నాడు. ఆతడే సరయిన గురువు.

కాస్టాల్‌స్కీ—నిజం. నికోలాయ్‌కాశ్యానోవిచ్ కోటోమిన్ ప్రియశిష్యుడు. ఆతని శిష్యులంతా మహాదిట్టమైనవాళ్ళు.

కింబయీావు—కాస్టాల్‌స్కీ! నీ వొళ్ళంతా విషం.

బోబ్రోవు— (ఎలెనాతో) ఎలెనా! నువ్వేం మాట్లాడవేం? నువ్వు నన్ను నమ్మటంలేదు. ఇన్‌స్టిట్యూట్‌లో ప్రతివాళ్ళూ

నన్ను తప్పించుకు తిరుగుతున్నారు. ఎవ్వరూ నాతో మాట్లాడరు. తప్పని సరిగా మాట్లాడవలసివచ్చినా నా ముఖంకేసి చూడరు. కళ్ళువొంచుకుని, విధ్వంసుకుని గుర్తులుకోసం వెతుకుతూన్నట్లు కనపడుతారు. వెనక తిరిగేక ఏమిటేమిటో రహస్యంగా చెప్పుకుంటారు. ఈపరిస్థితులలో పనిచెయ్యడం అసాధ్యం. ఎలెనా! ఒక్క కింబయీావే నన్ను నమ్ముతున్నాడు. అతడు కాస్త ఆసరాగా వుండకపోతే.

ఎలెనా—బొరోడిన్—యొక్క ఈలేబరేటరీ వుద్దేశ్యాల్ని నువ్వు స్పష్టంగా ఎందుకు చెప్పవు? ఈవిచారణల ఫలితంగా ఆతడు ఋజువు చెయ్యదలచుకున్నదేమిటి? ఆవిషయం నువ్వు ఏల బయలుపెట్టవు? నీకా భయం ఎందుకు? కుటుంబమర్యాదలా! పోనీయని కోటోమిన్ విషయంలో కూడా నీ అభిప్రాయం తేల్చకుండా వున్నావు. ఇంకా ఇప్పుడు కాదంటావు. సింహాసనం వొదిలిన చక్రవర్తిలా ఇన్‌స్టిట్యూట్‌చుట్టూ తిరుగుతావు. అది బాగులేదు. ఇది బాగులేదంటావు సలహాలు ఇవ్వబోతావు. ఒకరికి సలహాలు ఇచ్చేముందు నీకు విధ్వంసకులతో ఏమాత్రం సంబంధం లేదని ఋజువు చేసుకోవాలి. (ద్వారం వేపు నడుస్తుంది).

కింబయీావు—నీ మాటలకి అర్థంలేదు. కోటోమిన్‌ను పూర్తిగా బయట పెట్టడానికి అవసరమైన సహాయం నాకు పూర్తిగాచేసేరు. నా రిపోర్టు పూర్తిచెయ్యడానికి కోటోమిన్ వ్రాసిన ఆఖరు పుస్తకం కోసం ప్రయత్నించుతున్నా.

ఎలెనా—అంతమాత్రంతో అవదు.

కింబయీావు—ఏం ఎందుచేత? ఆమాత్రం చాలు బోబ్రోవుని అనుమానించడానికి నువ్వు చెప్పగలకారణాలు ఏమిటి? మనం అందరం కలిసి బొరోడిన్‌ని ఎదిరించాలి.

(ఎలెనాతో మాట్లాడుతూ కింబయీావు వెళ్ళిపోతాడు.)

కాస్టాల్‌స్కీ—మళ్ళీ ఆలస్యం అయిపోతుందేమో, గుర్రబ్బండి చేసుకు వేగంవెళ్ళు పత్రిక ఆఫీసుకి...ఎడిటరుకి జాబువ్రాయి. గురువుకి పంగ నామాలుపెట్టు. వానిమొహాన ఉమ్మివెయ్యి. భయంలేదులే—

అతడు చెరసాలలో పడ్డాడుగా. కావలసినంత పేరు ప్రతిష్ఠలు. ఇంకా ఊరుకుంటావేం?

బోబ్రోవు—(అరుస్తాడు) చాలించు ఈపాటికి.

బొరోడిన్—(లోనికి పరుగెత్తివచ్చి) నికోలాషా! ఏమిటి నీ పెదవులు అదిరిపోతున్నాయి.

బోబ్రోవు—మీ శిష్యుణ్ణి పూరుకోమని చెప్పండి.

కాస్టాల్‌స్కీ—ఎలెనామాకరోవా దయకోసం నికోలాయ్‌కోటో, మిన్‌పై విమర్శ తయారు చేయబోతున్నాడు.

బోబ్రోవు—కోటోమిన్‌తో నే నెప్పుడూ ఏకీభవించలేదు.

బొరోడిన్—కావచ్చు కాని, నీ వ్యతిరేకం చూపడానికి ఇదా సమయం? ఆతను జైలులో వుండగానా?

బోబ్రోవు—ఇంతవరకే ఆలస్యం అయింది. ఆలస్యం అయినా అసలులేనిదానికంటె నయమే నా మెత్తదనం చూసి కాస్టాల్‌స్కీ నన్ను అలుసు చెయ్యడానికి అవకాశం ఇవ్వను.

బొరోడిన్—(ఆశ్చర్యంతో) నికోలాయ్! నికోలాయ్, నికోలా కాకాశ్యానోవిచ్!

బోబ్రోవు—పత్రిక ఆఫీసుకి వెళ్ళుతూన్నా.

బొరోడిన్—నువ్వేం చిన్నపిల్లవాడివి కావు. ప్రొఫెసర్ బోబ్రోవ్? నువ్వు చేసేపనిలో మంచిచెడ్డలు నీకే తెలుసు.

కాస్టాల్‌స్కీ—అవసరం - అనవసరం, ఉపయోగం అనుపయోగం......

బొరోడిన్—మన స్నేహం చెడుతుందనిమాత్రం గ్రహించు.

బోబ్రోవు—స్నేహం కన్న సిద్ధాంతాలంటే నాకు అభిమానం.

(నటాషావస్తుంది.)

నటాషా—మామయ్యా! ఇక్కడుండే తాత మీద వ్యాసం వ్రాసేం.

బోబ్రోవు—ఏమిటది? ఓహో...సరే. ఇప్పుడే చూస్తా.

(వెడతాడు.)

బొరోడిన్—బో. బోవ్! ఆ పిల్లలకి కుందేళ్ళని చూపించు నాయనా!

నటపా—(బొరోడిన్‌తో) అదీ పద్ధతి. నీ మీద వ్రాసిన వ్యాసం ప్రకటించపనిలేదు.

బొరోడిన్—థ్యాంక్స్.

(బోబోవ్రివు పోయిన దారినే నటాపా వెడుతుంది.)

ఏమిటీ విడ్డూరం? ఇల్లాంటి చిన్నపిల్ల నాలాంటి హోదాలోవున్న వాడి మీద రాజకీయవ్యాసాలు వ్రాయడమా?

కాస్టాల్‌స్కీ—కోటోమిక్‌ని ఖండిస్తూ పత్రికలకి వ్రాయడం మరీ దారుణం... మిమ్మల్ని కూడా ఖండిస్తూ వ్రాసే రోజూ వస్తుంది.

బొరోడిక్—ఔను. నాకు తెలుసు ప్రజలలో అల్పత్వం పెరిగి పోతూంది. వారిలో పెద్దపెద్ద ఆశయాలేవీ లేవు. ప్రొఫెసర్‌కీ పైవీజన్ ట్‌స్కీ భేదం చెప్పడం కష్టం అయిపోతూంది. కాని నికోలాయ్ విషయమే విచారకరంగావుంది. పాపం, మహా అగాధంలో పడిపోతూన్నాడు. కాని, నాకేం, అది అతగాని స్వంత వ్యవహారం. నికోలాయ్ పెట్రోవిచ్ చాలా సరసుడు. అతనితో ఎక్కువ పరిచయం సంపాదించుకో. చెవులపిల్లుల్ని ఎంత ఏలా జాగ్రత్తగా పరీక్షచేసేనో అంత ఇల్లాగే అతనినీ పరీక్షచేసి చూసేను.

జఖారోవు—నికోలాయ్ పెట్రోవిచ్‌కి నక్షత్రబలంవుంది. రతి... అంగారకుడు... చంద్రుడు... అంగారకుడు పౌరుషం - చంద్రుడు అధికారం - రతి ప్రేమ అతనిలో కలిగిస్తూన్నారు.

(సెవిస్కీ వస్తాడు. మేనేజింగ్ డైరెక్టరు. పనిభారంచేత చాలా చిక్కిపోయివుంటాడు. చేతిలో బ్రీఫ్‌కేసు ఆడించుకుంటూ పరుగెత్తి వస్తాడు.)

సెవిస్కీ—ఇవాన్ ఇలిచ్! నీ లైబ్రరీ త్వరగా కూర్చుకో. మన ఎలవెన్నులు కోతపెట్టేరు.

బొరోడిన్—నిన్నెప్పుడూ ఇన్‌స్టిట్యూట్ సరిహద్దులోకేనా రావడం చూడలేదు నువ్వు మేనేజింగ్ డైరెక్టరువా?

నెవిస్కీ—గిరిగిరా తిరగడంతో నాపని అవుతూంది. ఇప్పటికి ఇన్‌స్టిట్యూట్ యొక్క బడ్జెటు పన్నెండు గవర్నమెంటు డిపార్టుమెంటుల లోంచి పదమూడో దానిలోకి తీసుకొచ్చేను. వాళ్ళు అక్కడ ఫీకకి పట్టించేరు. అయినా నేను వదలలేదు. మన పని సాగితీరాలి. ఇల్లాంటి విషయాలలో నెవిస్కీ తగ్గేరకం కాదు. బడ్జెటు ఓమాటు చూద్దామా?

(బొరోడిన్‌తో ఆతని గదిలోకి వెడతాడు.)

కాస్టాల్‌స్కీ కూడా వెళ్ళిపోతాడు. వర్గాసోవు వస్తాడు. జఖారోవు ఆతనిని పిలుస్తాడు.)

జఖారోవు—కోటోమిన్ని ఖండిస్తూ బోబ్రోవుపత్రికలకి వ్యాసం వ్రాయబోతూన్నాడు.

వర్గాసోవు—అంతమాత్రంచేత అతడు బయటపడలేదు. అన్నీ ఇది వరకే సిద్ధంఅయినాయి. జఖారోవిచ్! నీ కీవుద్యోగం ఏలాగ వచ్చిందో మాత్రం మరచిపోబోకు. నాతో కూడావుంటేనే నీకు ఉపయోగం తెలుసా? ఇప్పుడు చెప్పు అసలుసంగతి ఏమిటో?

జఖారోవు—పెంటాగ్రాం.

వర్గాసోవు—అదేమిటి?

జఖారోవు—(బ్లాక్ బోర్డుమీద వ్రాసిన జామిట్రికల్ డ్రాయింగ్ చూపిస్తూ) పెంటాగ్రా అబద్ధం ఆడితే సహించదు. చెప్పేమా నిజంచెప్పాలి. లేదా నోరుమూసుకు వూరుకోవాలి. వాళ్ళువుండగా నేనేమీ నోరు మెదపను. నీతో నిజంఅంతా చెప్తా.

(వర్గాసోవు బొరోడిన్ గదివేపు నడుస్తాడు. గదిలోంచి వస్తూన్న అమాలియా గుమ్మంవద్ద ఎదురుపడుతుంది. ఆమె లైబ్రరీగుండా నడిచి ఎదుటితలుపు తెరచి, హఠాత్తుగా వెనక్కి పరుగెత్తివస్తుంది.

అమాలియా—నన్ను దాచు. నన్ను దాచు. నేనాతణ్ణి చూడకూడదు.

జఖారోవు — ఎవర్నీ?

అమాలియా — తరువాత చెప్తా. త్వరగా జఖావిచ్! దాచునన్ను.

జఖారోవు — ఆగు.

(పుస్తకాలబీరువాల వెనకనున్న ఒక చిన్నతలుపు. తెరచి ఆమెని ఆదారిని పంపేస్తాడు. షెకోవాయ్, ఎలెనాలు వస్తారు. షెకోవాయ్ బొరోడిన్‌గదితలుపు తట్టుతాడు. ఆద్వారం తెరుచుకుని వర్గాసోవు వస్తాడు.)

షెకోవాయ్ — నెవిస్కీతో నేను వచ్చినట్లు చెప్పండి. ముఖ్యమైన విషయాలు మాట్లాడవలసివుంది. (ఎలెనాతో) బొరోడిన్ మార్కిస్టు కాదని నేనూ ఎరుగుదును. కాని, మానవప్రవర్తనకి సంబంధించిన సమస్యలకి ఆయన కనిపెట్టిన రహస్యవిషయాలు మనదేశానికి బాగా ఉపకరిస్తాయి. ఆవిధంగా ఆప్రొఫెసరు సోషలిజంయొక్క అభివృద్ధికి తోడ్పడతాడు. అదీ డైలెక్టిక్!

ఎలెనా — ఈగతి తర్కాలతో నాప్రాణం చివికిపోతూంది. మానవుని అమాయికత్వాన్నిగురించి బొరోడిన్ తనకిష్టంవచ్చినట్లల్లా చెప్తూన్నాడు. మనం విచారణచేస్తున్నదేమిటో ఎందుకో ఆదేవుడికే తెలియాలి. కాస్టాల్‌స్కీ తన ఇష్టంవచ్చినట్లల్లా వ్యవహరిస్తున్నాడు. నేను వ్రాసిన వ్యాసంకూడా ప్రకటించనీయలేదు.

షెకోవాయ్ — నువ్వు రాజకీయాలు మరచి విద్వద్వాదంలోకి దిగుతూన్నావు. అందుచేత బొరోడిన్‌పై నువ్వు వ్రాసిన ఖండనం విధ్వంసకులకి సహాయకరంగా తయారవుతుంది.

ఎలెనా — నీకు మతిలేదు!

షెకోవాయ్ ప్రస్తుతస్థితిలో నీతో ఒక్కబోర్బోవే తాళంవేస్తాడు కాని, జాగ్రత్త. జ్ఞాపకంవుంచుకో. అతగాడు కోటోమిన్ శిష్యుడనీ, లేబరేటరీ స్థాపించడానికి వ్యతిరేకుడనీ మరవకు.

ఎలెనా— కోటోమిన్ శిష్యుడైనంతమాత్రాన ఇరువురూ ఒకేపనిలో నియుక్తులని చెప్పడం తప్పు.

షెకోవాయ్— అలాగేం? (నెవిస్కీ వస్తాడు.) కామ్రేడ్ నెవిస్కీ! విన్నావూ? (పుస్తకంమీద వ్రాత చదువుతాడు.)...నాఅభిప్రాయాలతో ఏకీభవించే నామిత్రుడు నికోలాయ్ బోబ్రోవుకి - పావెల్ కోటోమిన్"... తనువ్రాసిన పుస్తకంమీద తన స్వంతదస్తూరీ. ఈవిధ్వంసకుణ్ణి ఇంకా బయటపెట్టకుండా డిపార్టుమెంటుమీద అధికారంలోవుంచేరు. ఇన్‌స్టిట్యూట్ యొక్క అధికారవర్గం అపర్ట్యూనిస్టు మార్గం తొక్కుతూంది.

నెవిస్కీ—(నవ్వుతాడు) హ్హా!

షెకోవాయ్— నెవిస్కీ! ఇది నవ్వ వెయ్యవలసిన విషయంకాదు.

నెవిస్కీ— ఏంచెయ్యడానికీ ఏదో ఒక 'డీవియేటర్' అని నిందించకమానరు. నీపుణ్యమాయిరి, ఏంచెయ్యమంటావో చెప్పనూ. బోబ్రోవుమీద ఈగనికూడా వాలనియ్యడు బారోడిను.

షెకోవాయ్— మనం అతినిర్మొగమాటంగా వ్యవహరించాలి. ఇప్పుడు వారిద్దరిమధ్యా వెనకటంత స్నేహంలేదు. బోబ్రోవుని డిస్మిస్ చేస్తే బారోడిన్ కాదనికూడా అనడనే నావూహ.

నెవిస్కీ— సంగతి అలావుంటే, వ్యవహారం సాఫీచెయ్యవచ్చు. అయితే బోబ్రోవు ఖాళీలో ఎవర్ని వెయ్యడం? ఎలెనా! నీకిష్టమా?

ఎలెనా— కామ్రేడ్స్! బోబ్రోవుకాదు. బారోడిన్, కాస్టాల్ స్కీలే మనకి నిజమైన శత్రువులు.

షెకోవాయ్— ఇదోకొత్తమాట. బోబ్రోవుకాదూ? సాచెయ్యాలని చూస్తుంది, ఎలెనాకి ధైర్యం చాలడంలేదు. ఈవిషయంలో మనం కఠోరంగావుండకుంటే లాభంలేదు.

నెవిస్కీ— ఆమె కిష్టంలేకుంటే షెకోవాయ్! నువ్వేవుండాలి! ఇంకెవ్వరూలేరుమరి!

ఎలెనా— కామ్రేడ్! వ్యవహారం చక్కబెట్టవలసిన విధానం అది కాదు. మరొకశాఖలోని విద్యార్థిని తనశాఖకాని శాఖలో ప్రొఫెసరుగా వెయ్యడం చాలపొరపాటు. అది బాధ్యతగలపని!

షెకోవాయ్—కమ్యూనిస్టుపార్టీ సభ్యుడు. పైగా నీమగడు అయిన వాని విషయంలో అంత అపనమ్మకంచూపడం ఆశ్చర్యంగావుంది.

సెవిస్కీ—అతడు నిర్వహించుకోగలడా? లేడా? అనేది ఆలోచించుకోవలసిన విషయం. అంతే. నన్ను తోళ్ళకంపెనీలోంచి తీసుకువచ్చి ఈఇన్‌స్టిట్యూట్‌లో పెట్టేరు. కుందేళ్ళవిషయంలో నాకు తెలిసిందల్లా వాటి చర్మాన్ని గురించిమాత్రమే. అయినా నేనీ ఇన్‌స్టిట్యూట్‌కి మేనేజింగ్ డైరెక్టర్ని. అదీ డైలెక్టర్!

ఎలెనా—నువ్వూ డైలెక్టిక్సునిగురించే మాట్లాడుతూన్నావూ?... డైలెక్టిక్స్!

సెవిస్కీ—అదో ఊతపదం అయిపోయింది. అంతా స్వేచ్ఛగా వాడేస్తున్నారు. సరేకాని, నికోలాయ్ ఏంచెప్పేవు? ఒప్పుకుంటావా? బోబ్రోవుని తప్పించేసి, నిన్నాడిపార్టుమెంటుకి ఛైర్మన్‌గా వేస్తాము.

షెకోవాయ్—ప్రెసీడియంలో సభ్యుడుగాకూడానా?

సెవిస్కీ—ఆహా! వేరే చెప్పపనిలేదు. అదివుంటే ఇదీవున్నట్టే.

ఎలెనా—లేబరేటరీలో ఎవర్ని పరీక్షించాలి - అన్నసమస్య... బోరోడిన్‌యొక్క కార్యవిధానం.

షెకోవాయ్—దానినిగురించి పత్రికలలో వ్రాయడానికి వీలులేదు.

(సెవిస్కీ, ఎలెనా, షెకోవాయ్‌లు వెళ్ళిపోతారు. జఖారోవు బోరోడిన్ గదిద్వారంవద్దకు పోయి నెమ్మదిగా ధ్వనిచేస్తాడు. వర్గాసోవు బయటకి వస్తాడు. జఖారోవు ఆతనిని తీసుకుని బ్లాక్‌బోర్డుదగ్గరికివస్తాడు. జఖారోవుసుద్దతో వ్రాస్తాడు.)

జఖారోవు—ఇదిగో... ఈచుక్క ఆచిన్నపిల్ల. ఆమెతండ్రి నికోలాయ్ పెట్రోవిచ్ షెకోవాయ్ (ఎడమవేపుగా క్రిందుగా ఒకచుక్క పెట్టి రెంటినీ కలుపుతూ గీస్తాడు.) అమాలియా కార్లోనా ఈచిన్నపిల్లని ఎరుగును. (కుడిచేతివైపుగా క్రిందికి ఒకగీతగీస్తాడు.) కనక, అమాలియాకీ,

షెకోవాయ్‌కీ, ఏదో సంబంధం ఉండివుండాలి. (క్రిందిచుక్కలు కలుపుతూ గీతగీస్తాడు. త్రిభుజం తయారయింది.) త్రిభుజం! వారిరువురిమధ్యా గల బాంధవ్యం ఏమిటో_ఎరుగుదువా? (అమాలియా వెళ్ళిన బీరువా వెనకనున్న చిన్నద్వారం తెరుస్తాడు.) లోనికిపోయిచూడు.

వర్గాసోవు—(స్తంభితుడై) ఏమిటి? ... షెకోవాయ్ ... అమాలియా......

[తెర]

## నాలుగోరంగం

(రెండోరంగలో నిరూపించిన మాదిరి ఎలెనా ఇంటిగది. కింబయీవు పుస్తకం చదువుకుంటూ, అప్పుడప్పుడు క్రిందబెట్టి క్లారా_ఎలెనాలతో మాట్లాడుతూంటాడు.)

ఎలెనా—నాకేమీ తెలియడం లేదు. నేను ఆపనికి తగను. బొరోడిన్ నిజమే చెప్పేడు. నాది చుంచుతలకాయి. అటువంటి తలకాయితో వైజ్ఞానిక పరిశోధనలకి ఏమీ తగను.

కింబయీవు—ఎలెనా! వట్టి పొరపాటు. నాతల పరిశోధనలకి పనికి రాలేదూ? నా మొద్దు తల? నా కొజక్ తల — రాయినేసి కొడితే రాయి పగలవలసిందేగాని, దీనికి చలనంలేదు. రాత్రులు తెల్లవార్లూ మేలుకుని, ఇంతంతలావు పుస్తకాలు చదివేస్తూన్నా. ఒక్కొక్క పుస్తకం పూర్తి అయ్యేటంతకి (చేతులతో చూపుతూ) అంతంతవాడిని అయిపోతూన్నాను. త్వరలోనే ఈయిల్లు పట్టనంత పొడుగు ఎదిగేలావున్నాను. ఎలెనా! మనం బెంబేలు పడకూడదు. ఎప్పుడూ ముందుకే.

ఎలెనా—మానవ ప్రవర్తనాపరిశోధకశాల పేరు చెబితే నాగుండెలు జారిపోతూన్నాయి. బొరోడిన్ ఓ వల పన్నుతున్నాడు. సోవియటు ప్రభుత్వంచేత అపకారం పొందినవారందరినుంచీ ప్రశ్నావళికి సమాధానాలు తీసుకుంటున్నాడు—కాని మనం ఏమీ చెయ్యలేకుండావున్నాం.

క్లారా—చవటా, చవట! నిన్ను మరొకపేరున పిలవడానికి వీలు లేదు. ఏమిటల్లా మాట్లాడుతున్నావు? మీ తండ్రి అన్యాయమైన శ్రామికుడు.

నువ్వుకూడా కొంతకాలం ఫ్యాక్టరీలోపని చేసేవు. కాని, చూసుకున్నావా ఏలావున్నావో. లేబరేటరీకి భయపడుతూన్నావూ? బెదిరిపోయిన కుందేలులా పొదలలో దూరుతూన్నావూ? ఆచెవులు పుచ్చుకుని పొదల లోంచి బయటికి ఈడుస్తాం...నలుగురిలోకీ తీసుకువచ్చి, ఆలోచించే పద్ధతి నేర్పుతాం.

కింబయీావు—బోబ్రోవు ఈమాటలు ఇదివరకే చెప్పేడు. కాని, బోబ్రోవుని గెంటేసేరు. ఆతడు తలవేళ్లల వేసుకు తిరుగుతున్నాడు. బొరోడినుని వదిలిపెట్టేసేడు. కాని, మన దగ్గిరకి రాలేకపోయేడు. ఎలెనా! బోబ్రోవుని పిలు. మనం అందరం కలిసి పనిచేద్దాం.

ఎలెనా— నేను ఎవర్నీ పిలవను.

కింబయీావు—ఇప్పుడు నీభర్త నికోలాయ్ డిపార్టుమెంటు అధ్యక్షుడు. నీమగడు—కమ్యూనిస్టుపార్టీ సభ్యుడు అయివుండీ—బోబ్రోవుని సరిగ్గా చూడలేకపోయేడు.

ఎలెనా— నేనేదో బాధపడుతున్నాననుకుంటున్నాడు, నికోలాయ్. ఇద్దరికీ పంక్తి భోజనాలుకూడా చెడ్డాయి. ఈవేళ ట్రాంలో మేమిద్దరం పేచీపడ్డాం. చూసేవారంతా ఆనందించేరు. కాని, అతగాడికేమీ విచారం లేదు. ఆవుద్యోగానికి మురిసిపోతున్నాడు. ఆఖరికి నేను ఇంటిదాసీనై పోయేను.

క్లారా—జాగ్రత్త. లేదా పార్టీనుంచి గెంటివేస్తాం. ఆశ్చర్యకరంగా వుందే! క్లాసులోంచి బయటికి రావడంతో అన్నీ అనుమానాలే. ఎక్కువ ఆలోచనకి ఫలితం అనుకుంటున్నావేమో, కాని, అది నీ మనోదార్ఢ్యం లేకపోవడానికి ఫలితం. నీ అతి ఆలోచన కట్టిపెట్టు.

కింబయీావు—అదేమిటి? ఎప్పుడూ వినలేదే.

క్లారా—ఆమె యిప్పుడు ప్రపంచాన్నిగురించి తెగఆలోస్తూంది. పార్టీ ఇప్పుడు వెనకబడిపోతూందిట. నే చెప్పినట్లల్లా సాగిందా, మిమ్మ ల్నందర్నీ ఎగరకొట్టేస్తా.

ఎలెనా—ఎగరకొట్టడం కాదు తెలివి. చేతనైతే సహాయం చెయ్యి.

క్లారా—నన్నిప్పుడు ఇన్‌స్టిట్యూట్‌లో చేరమంటావా, యేం? అరవైఏళ్ళువచ్చేక చదువుకోక మన్నుకొట్టుకోనా?

కింబయీవు—(ఎగిరి గంతువేసి) నిన్నెవరు చదువుకో మన్నారు? నిన్నెవ్వరూ చదవమనడంలేదు. మా ఇన్‌స్టిట్యూట్‌కి పోషకురాలివి ఏల కాకూడదు. ఫ్యాక్టరీఅంతా ఇన్‌స్టిట్యూట్ యొక్క పోషకులుగా చేర వచ్చునే మాకు మార్గం చూపించవచ్చునే. ఇప్పుడు మేం తొక్కినదారి పొరపాటు—పొరపాటు. హుస్సేన్‌ది చాలా గట్టిబుర్ర. ఇదంతా నేను స్వయంగా ఆలోచించినదే. (తన బుర్రపట్టుకుంటాడు.) నాకు తలనొప్పి గావుంది. రాత్రిళ్ళు నాబుర్రలో మాటలూ - పదాలూ, అటూ, ఇటూ పరుగెత్తిపోతూంటాయి. వాటిని పట్టుకోవడమే బ్రహ్మాండంగావుంది.

(షెకోవాయ్, వాలంటీనాలు వస్తారు.)

క్లారా—ఎక్కడనుంచిరాక?...ఏమిటూ ఆనందం?

వాలంటీనా—మళ్ళీ చిత్రకళ ఎత్తుకున్నాను. ఇప్పుడు నికోలాయ్ పెట్రోవిచ్ నా కొత్తబొమ్మకి 'మోడల్' ఆ శిల్పం ఏమిటో తెలుసా? 'శ్రామికుడు: విజ్ఞానం...' అద్భుతమైన చిత్రం. అసాధారణమైన 'మోడలు...' ఆతలచూడు. చలవరాయితో చేసినట్లుగా ఏలావుందో. ఆకాళ్ళూ-చేతులూ శిల్పంకోసమే పుట్టేయి,

షెకోవాయ్—వ్లాలంటీనాఇవానోనా! ఏమిటి నన్ను తెగపొగిడేస్తూన్నావు?

క్లారా—ఫ్యాక్టరీకి వెళ్ళడంకివేళయింది, మరిచేవా?

వాలంటీనా—క్లాడ్యావాసిలీనా ! అక్కడ దిక్కుమాలినహోరు. దుమ్ము. నాకు మతిపోయింది. ఒంటరిగావుండలేక చచ్చిపోయేను. ఒక్కడూ నామొహంకేసేనా చూడడు. నాకేమీ తెలియలేదు. చెక్కడపుపని వదలిపెట్టేక ఏమీతోచడంలేదు.

క్లారా—మరొకర్తె, మొగం దాచుకుంటూంది. .నీ విషయంలో నాకేమీ బాధలేదు. నీ కిష్టం వచ్చినట్లు చేసుకో. కానీ—పెదవులకి రంగుపూసుకో. నీ బొమ్మలు గీసుకో. నీ మనస్సుకి వచ్చినట్లు ఆనందించు. హుస్సేన్; రా నాయనా! మనం పోషకవర్గంవిషయం ఆలోచించుకుందాం.

కింబయీావు—క్లారా! నీవింకా పడుచుదానివే. మహాచురుకయిన దానివి... (క్లారాతో ఆమె గదిలోకి వెడతాడు.)

వాలంటీనా—ఆమె మనస్సుకి కష్టంతోచింది.

షెకోవాయ్—ముసిలిది మహాగట్టిది. ఆమెజోలికి పోబోకు. వదిలెయ్యి.

ఎలెనా—మహాగట్టి సలహా.

వాలంటీనా—నా శిల్పానికి నువ్వు 'పోజ్' ఇవ్వకూడదూ?

ఎలెనా—మాకు తీరుబడి లేదు.

షెకోవాయ్—మాకు కాదు. నాకు అను...ఎలెనావున్నచోటికి కూడా కళ చేరదు. రతీవిగ్రహం నగ్నస్త్రీవిగ్రహం. శిలువపైనున్న క్రీస్తు బొమ్మ మతపిచ్చి. ఆమె వైజ్ఞానికురాలు. ఆమె మెదడు పనిచేస్తునేవుంది. కాని, సరదాలూ, సంతోషాలూ చచ్చిపోయినాయి.

ఎలెనా—నికోలాయ్!

షెకోవాయ్—ఈగదివేపు చూడు! బోసికిటికీలు, నలిపిపారవేసిన న్యూస్ పేపర్లు, గోడలపై మరకలు, మేజాగుడ్డమీద చిరుగులు, సిగరెట్టు పీలికలు, ఎంగిలికంచాలు, నీళ్ళులేని నీటితొట్టె...ఇవేమీ నీకు చీమకుట్టినట్లేనా అనిపించవు. వీటిమీదికి నీదృష్టేపోరదు.

ఎలెనా—నిన్నటివరకూ తమకి మాత్రం ఇవన్నీ తోచేయీా?

షెకోవాయ్—నిన్నటిదాకా నేను సామాన్యమైన గ్రాడ్యుయేట్ స్టూడెంటునే.

ఎలెనా—ఒలికింది. ఈమార్పులో నాకంత గొప్ప ఏమీ కనపడటం లేదు. అప్పుడే ప్రాముఖ్యతగల పెద్ద ఆఫీసరువి అయిపోయేవుకాబోలు!

షెకోవాయ్—కొంచెం నాగరికంగా బ్రతకడం తప్పా?

ఎలెనా—అల్లా అన్నావు బాగుంది. గది ఇప్పుడేబాగుచేస్తా.

షెకోవాయ్—ఆమాత్రం పని గుడ్డిముండ చేస్తుంది. అసలు కావల సింది జ్ఞానం.

వాలంటీనా—నే వెడుతూన్నా. క్లారాతో మాట్లాడాలి. ఆమె మనస్సుకి బాధకలిగించేనని విచారంగా వుంది.

(తలుపుపై కొడుతుంది. 'లోనికి రమ్మ'ని లోనుంచి క్లారాధ్వని. వాలంటీనా క్లారాగదిలోకి పోతుంది.)

ఎలెనా—ఆపిల్లముందర నన్ను అవమాన పరిచేవు.

షెకోవాయ్—ఆమె మెలగుబాటు అప్పుడే నీ మనస్సుని ఆకర్షిం చింది. సరదాలు...సంతోషాలు...నిజమే ముప్పైఏళ్ళదాన్ని నేను, ఇరవై మూడేళ్ళది ఆమె. ఇంకా చిన్నపిల్ల. పడుచుతనపు బింకం...

షెకోవాయ్—నీబ్రతుకేఅంత. పొరపాటున ఆడదానివైపు ట్టేవు.

ఎలెనా—ఈఅయిదేళ్ళనుంచీ ఆమాట తోచలేదుకాబోలు నేం?

షెకోవాయ్—కాదు. పరిపాటి అయిపోయింది ... (మడతపెట్టిన వార్తాపత్రిక గోడకు పెట్టికొట్టి) ఈఈగలకి అలవాటుపడ్డట్టే.

ఎలెనా—(నీరులేని నీటితొట్టి షెకోవాయ్‌పై విసిరి) తుంటరీ!

(చీపురుకట్టవిసరబోయేసమయానికి వాలంటీనా ప్రవేశిస్తుంది. నిశ్శబ్దం.)

షెకోవాయ్—వాల్యా! నే మీయింటిదాకావస్తా.

వాలంటీనా—వద్దువద్దు. నేపోతా.

షెకోవాయ్—నేవస్తానుకాదూ?

వాలంటీనా—సెలవు! ఎలెనా.

ఎలెనా—(వాలంటీనా జబ్బపట్టుకొని) వాలంటీనా, నీవ్వూడియోలో ఈతనితో తలుపులుమూసుకుని కూర్చోడంఎందుకు? ఆరహాస్యాలు ఎం దుకు?...(చేయిపుచ్చుకులాగి) దాగుడుమూతలు...మోసాలు ఎందుకు?

వాలంటీనా—నన్నువొదులు! (బాధతో అరుస్తుంది.)

ఎలెనా—గట్టిగా! గట్టిగా! గొంతెత్తి చెప్పు నీప్రేమని.

వాలంటీనా— నేనెవ్వరినీ ప్రేమించడంలేదు. నన్నువొదులు. నీచేతులు మంచులావున్నాయి.

(వాలంటీనా విడిపించుకుని పారిపోతుంది. షెకోవాయ్ ఆమెవెనక పరుగెత్తుతాడు.)

షెకోవాయ్— అయింది చాలు! ఈఅవమానపుపిశాచంతో చేసిన కాపరంచాలు.

ఎలెనా—(అతనినిఉద్దేశించి) నాకేం అనుమానంలేదు.

(కూర్చుని ఏడుస్తుంది. క్లారావస్తుంది.)

క్లారా—ఎందుకేడుస్తున్నావు? పుప్పిపన్ను సలుపుతూందా?

ఎలెనా—నాకూ నికోలాయ్‌కీ సంబంధం వొదిలిపోయింది.

క్లారా—ఎప్పుడమ్మా! ఇప్పుడేకాదూ, మాట్లాడుతూన్నావు. అప్పుడే ఈప్రయాణం చేయడం జరిగిపోయిందీ...ఏవీ నీకళ్ళు...ఇల్లారా చూడనీ! (గడ్డం పట్టుకొని ఎలెనా మొగం ఎత్తుతుంది.) ఏడవకు అల్లాగ! ఏడవకు! కళ్ళుతుడుచుకో. (జేబురుమాలు ఇస్తుంది.) ఆడవాళ్ళకి ముందు ఏడుపుపుట్టింద. అయితే ఇది ప్రణయకలహమా?

ఎలెనా—పూర్తిగా విడిపోయేం.

క్లారా—వాలంటీనాతో వెళ్ళిపోయేడా?...అందమైనపిల్లే!

ఎలెనా—లక్కబొమ్మ! చవట!

క్లారా—అసూయ కక్కుతూన్నావు.

ఎలెనా—నాకేం అసూయలేదు.

క్లారా—అయితే ఇదంతా అభిమానమేనా?

ఎలెనా—నాకంటె చిన్నది. అంతేనాగొప్ప?

క్లారా—అప్పుడే ముసలిదానివి అయిపోయేవు కాబోలునేం? నీవయస్సులో నేను ప్రపంచాన్ని గిరగన తిప్పేసేను. ఓమానవుడు వదిలిపెడితే లోటువచ్చిందా? ప్రపంచం అతగాడితోనేవుందా? అతణ్ని మరిచిపో. నేను మరొకణ్ణి వెతికిపెడతా. మనఫ్యాక్టరీలో వేలకొలది పడుచు

వాళ్ళు వున్నారు. పార్టీద్వారా ఓపదిమంది మంచివాళ్ళని నీదగ్గిరికి పంపిస్తా. నీకు నచ్చినవాణ్ణి ఏరుకో. లేదా అంతకంటే మంచిమార్గం! ఫ్యాక్టరీ రెస్టారెంట్ తెరుస్తారు ఈవేళ. ఈవేళ విందు జరగబోతూంది. కులాసాగా కాలం గడిచిపోతుంది. రా, పోదాం.

(కింబయీవువస్తాడు.)

కింబయీవు—క్లారా, ఇవిగో నాప్లానులు...ఎలెనా! ఏమిటిఅలాగ వున్నావు? కళ్ళు ఎర్రగావున్నాయేం? ఏంమండుతూన్నాయా? నాకళ్లూ అలాగే బాధపెడుతూంటాయి. ఇసకపోసినట్లేవుంటాయి. ఎలెనా! నీమగడున్నాడే, మహామంచివాడు. నువ్వు మంచిపెళ్ళానివి. నేనూ మంచి మగణ్ణి కాలేను కాని, ఓమంచిపెళ్ళాన్ని వెతికిపెడతావా?

క్లారా—అయితే ఎలెనానే పెళ్లిచేసుకో. ఆమె మగడినుంచి విడిపడింది.

కింబయీవు—ఆఁ. ఆఁ. ఆఁ. విడిపడిందీ! విడిపడిందీ! పెళ్ళాన్ని విడిపడనిచ్చేడూ, నికోలాయ్, ఎందుకూ పనికిరానివాడు. నేను నాభార్యని ఆమైదానాలలోకి తీసుకుపోయి తిప్పుతా. చావగొడతాను. కాని, విడిపోనిస్తానేం?

ఎలెనా—నికోలాయీ నేనూ ఒకేపనిచేసేవాళ్లం. ఒకరికొకరు సాయంగావుండేవాళ్ళం. మాఇద్దరి ఆలోచనలూ ఒక్కటే...మాగమ్యం ఒక్కటే...ఈనాటినుంచా? అండర్ గ్రాడ్యుయేట్లం అయిననాటినుంచీ. అతడో పెద్దఆఫీసరు అయిపోయాడు. అతనికి నాఅవసరం ఏంవుంది?

(నటాషా వస్తుంది. బంగారు రంగు చేపలున్న గాజుతొట్టి మేజామీద పెడుతుంది.)

నటాషా—క్లారా! చూడు. చూడు. ఎలెనా, ఏక్వేరియం. స్కూలులో మాక్లాసువాళ్ళకి ఈఆక్వేరియం బోబ్రోవుమామ చేసిపెట్టేడు. మా క్లబ్బుకి తరుచుగా వొస్తుంటాడు. వసంతకాలంనాటికి కుందేళ్ళు పెంచుకుం

దుకుఓకర్రిపెట్టె చేసిపెడతానన్నాడు. రాండి. చూడండి ఎంతవాగుందో. క్లారా! ఎలెనా! హాన్సేన్!

కింబయిూవు—ఎలెనా! ఓమారు బోబ్రోవుతో మాట్లాడిచూడు. అతడు చాలామంచివాడు. అతనికి నీసహాయం - నీకు అతని సహాయం అవసరం.

ఎలెనా—వద్దు. ఆమహాత్ముడు...ఇంక వెక్కిరింత ప్రారంభించగలడు. "నే చెప్పలేదూ? - హెచ్చరించలేదూ?"—వద్దు నే నొక్కర్తెనీ పనిచెయ్యగలను.

క్లారా—నీకు వొంట్లో బాగాలేదనుకుంటాను. నీ పద్ధతి ఏమీ బాగాలేదు. ఏమీబాగాలేదు.

నటాషా—క్లారా? ఇటురా. రా, ఎలెనా! హాన్సేన్! నా చిన్ని చేపల్ని ఓమాటు చూడండర్రా!

ఎలెనా—బాగున్నాయి తల్లీ. వాటికన్నా నువ్వు బాగున్నావు. నువ్వు నాకడుపునే ఎందుకు పుట్టేవుకాదు?

నటాషా—అల్లా అన్నావేం?

ఎలెనా—ఒక్కచోటనే వుండేవాళ్ళు - విడిపోకుండా!

నటాషా—ఇప్పుడు వుండడం లేదా? విడిపోవలసిన అవసరం ఏం వొచ్చింది? నీ మీద నాకు చాలాప్రేమవుంది, ఎలెనా! కాని, నీకు తీరిక ఏదీ? (షెకోవాయ్ గదిలోంచి వెడుతూంటాడు,)

నటాషా—నాన్నా! నా ఎక్వేరియం చూడు! నాన్నా!

షెకోవాయ్—నన్ను చంపకు! (వెడతాడు.)

నటాషా—ఏం వొచ్చిందబ్బా! చిత్రంగావుందే.

ఎలెనా—చిత్రంగా వుంది.

(ఒక్క క్షణం నిశ్శబ్దం. నటాషా, తన బంగారు చేపల తొట్టెతో ఆడుకుంటూ, తనలోతానే, తన పాతకాల సంగతులు చెప్పుకుంటూ వుంటుంది.)

8

నటాషా — స్క్యోర్యోకాని మాలోంచి ఎక్స్పెల్ చేసి వేసేరు... అతని తండ్రి మతగురువు. కాని, అతడు తానో గుమాస్తా కొడుకునని చెప్పేడు... మా నాయకుడు ఏమన్నాడో తెలుసా. స్క్యోర్యోకా మనల్ని మోసం చేసేడు. శ్రామికవర్గాన్ని మాత్రం మోసగించడూ ఆలాంటివాడు? అత్తయ్యా! శ్రామికవర్గాన్ని మోసగించడం చాలా తప్పు.

క్లారా — మీ నాయకుడు చెప్పేడు గనక తప్పే అయివుంటుంది.

నటాషా — పందెం. అందరికంటే ముఖ్యమైన నాయకుడు ఎవరో చెప్పు? చెప్పగలవా? నేను చెప్పగలను. అందరికన్నా ప్రధాననాయకుడు_ స్టార్లి... (చేపల్ని చూస్తు) చేపలు ఏలాగ మునుగుతూన్నాయో చూడు.

ఎలెనా — క్లారా! ఈచిన్నబిడ్డ నాతో వుండిపోతే బాగుండును... నాకో ఆడు బిడ్డయినా కలిగింది కాదేమిటి? కాస్త దానితోనే నా కాలక్షేపం అయివుండును.

క్లారా — చాలులే. ఎందుకేమిటి? అప్పుడే వయసు మళ్ళిపోయిందా? బట్టలు వేసుకో. రెస్టారెంటు తెరిచే వేళయింది. పోదాం.

ఎలెనా — నిజం. క్లారా! ధైర్యం చిక్కబట్టుకోవాలి. క్షమించు. నడు. పోదాం.

కింబయీవు — నేనూవస్తా. ఎలెనాని ఒక్కక్షణంకూడా వదలతలుచుకోలేదు. ఒంటరిగా తిరిగి రావడం మంచిదికాదు, నాదగ్గర మూడు టాబ్లెట్లికెట్లున్నాయి. నడవండి.

[క్లారా, ఎలెనా, కింబయీవులు వెడతారు. నటాషా ఒక్కర్తే వుంటుంది.]

నటాషా — బలేగావుంది. పీక్కుతినేవాళ్ళు ఎవ్వరూలేరు. చేపలకి కాస్త మేతవేస్తా. మజాగావుంది. (పాడుతుంది.)

బలే మజాగా వున్నాదీ
బందరు చేపల - చెరలాటాలు
బలే మజాగా వున్నాదీ...

[కాస్టాల్‌స్కీ వస్తాడు.]

కాస్టాల్‌స్కీ—మీ నాన్నని ఓమారు పిలుస్తావా అమ్మా!

నటాషా—కూర్చోండి. (పరుగెత్తి వెడుతుంది. కాస్టాల్‌స్కీ కూర్చుంటాడు. నటాషా - షెకోవాయ్‌లు ప్రవేశిస్తారు.

షెకోవాయ్—పోయిపడుకో, నటాషా!

నటాషా—చేపలతో ఆడుకుంటా.

షెకోవాయ్—పోయిపడుకోవమ్మా!

నటాషా—నా చేపల్ని ఎవ్వర్నీ ముట్టుకోనీకేం. (వెడుతుంది)

కాస్టాల్‌స్కీ—నికోలాయ్ పెట్రోవిచ్! నీకు దేవుడంటే విశ్వాసంవుందా?

షెకోవాయ్—ఏమిటా ప్రశ్న?

కాస్టాల్‌స్కీ—అయితే నమ్మవన్నమాట. అంటే దయ్యాలంటే కూడా నమ్మకం లేదన్నమాటేనా? ఆత్మల బాంధవ్యం అన్నా నమ్మకం లేదు కాదు?

షెకోవాయ్—మతిపోయిందా, లేక నన్ను బోల్తాకొట్టించాలని చూస్తున్నావా?

కాస్టాల్‌స్కీ—కాని వర్గబాంధవ్యం ఒప్పుకు తీరుతావని నానమ్మకం. సాంఘిక ఐక్యత - సమానత్వాన్ని నువ్వు ఒప్పుకుంటావు. చెప్పవేం సమాధానం ... నిజంగానే అడుగుతూన్నా ... వర్గసోదరులు కావడానికి ఎవరికేనా అవకాశం వుంటుందంటావా?

షెకోవాయ్—ఉండవచ్చును.

కాస్టాల్‌స్కీ—ఒకే తరగతిలో పుట్టడంచేత సోదరులనవచ్చునంటావు! అయితే నికోలాయ్ పెట్రోవిచ్! మనం ఇద్దరం సోదరులం అవుతాము.

షెకోవాయ్—(విసుగుతో) ఏమిటీగోల?

కాస్టాల్‌స్కీ—మనంఇద్దరం సోదరులమే అంటే మనయిద్దరికీ తండ్రి వొకడేనని కాదు. నాతండ్రి ఒక శాసనసభ్యుడు. నీతండ్రి ఓ చిన్నపోస్టు ఆఫీసు గుమాస్తా. ఆతడు విప్లవంలో ఎవ్వరిపక్షానికీ చేరలేదు. ప్రభుత్వం ఎవ్వరిచేతులలలోవున్నా, జాబులు సక్రమంగా అందించేవాడు. నీ డాక్యు మెంట్లులో వ్రాసుకోవడానికి ఇదొక పెద్ద అవకాశం దొరికింది.

షెకోవాయ్—నీతో ఆవిషయం నేను చర్చించతలుచుకోలేదు.

కాస్టాల్‌స్కీ—నీ పార్టీపత్రాలలో నీతండ్రి ఒక చిన్నపోస్టు గుమాస్తా అని మాత్రం వ్రాసేవు. అంతేకాదు. ఇంకావుంది. నీ తల్లి ఒక కూలిమనిషి అనీ, 1921 లో తిండిలేక సమారాలో చచ్చిపోయిందనీ వ్రాసేవు. కాదూ? 1922 లో ఫ్యాక్టరీలో పదవి సంపాదించేవు. 1925 వరకూ అక్కడే పనిచేసేవు. అటుతర్వాత పార్టీలో చేరేవు. తరువాత యూనివర్సిటీలోచేరేవు. అక్కడినుంచి గ్రాడ్యుయేటు విద్యార్థిగా మా ఇన్‌స్టిట్యూట్‌కి వచ్చేవు. అంతేనా? చూసేవూ? నాకన్ని సంగతులూ తెలుసు (నెమ్మదిగా - గంభీరంగా) ఇవన్నీ ఇల్లావుంచు. నువ్వు ఒక మిలిటరీ ప్రోసిక్యూటరు కొడుకువని నే నెరుగుదును.

షెకోవాయ్—అసలు సంగతి చెప్పు.

కాస్టాల్‌స్కీ—అప్రోడిటుయొక్క లోపాలు తెలియక పోవడంచేత 'మోమస్' చాలా అసూయపడింది. నేనూ 'మోమస్' లాగేనీపార్టీ రికార్డు చదివేను. ఒక్క చిన్నరహస్యం నాకు తెలిసివుండకపోతే నేనూ 'మోమస్' మాదిరిగా నేబోల్తాకొట్టివుండేవాడిని...ఆరహస్యం ఏమిటో ఎరుగుదువా?... మీాయమ్మ బ్రిదికివుంది!

షెకోవాయ్—మాయమ్మ!

కాస్టాల్‌స్కీ—ఆశ్చర్యాలకి సమయముకాదు...ఇప్పుడేనా తెలిసిందా నువ్వూ - నేనూ సోదరులం ఏలాగనయ్యేమో. మనం ఒక్కరకం వాతావరణంలోనే పుట్టి పెరిగేం. ఒకే వర్గంలో పుట్టేం. కాని, అనుభవంలో తేడావచ్చింది అనుకో. నువ్వు కొంచెం పెద్దవాడివీ, తెలివైనవాడివీ గనక—పొగడిక కాదు. నిజంగానే చెప్తూన్నా - చల్లగా మిలిటరీ

వ్రాసిన్యాయటరు పేరూ, అడ్మిరల్ కూతరు పేరూ తీసివేసుకున్నావు...ఇంక నేను— చేతనైందికాదు. నా పేరు హెర్మన్ గానే వుండిపోయింది — అటువంటి సౌకర్యం పొందడం నాచేతనయిందికాదు...చిన్నప్పటినుంచీ నేను దురదృష్టవంతుణ్ణే. పుట్టుకలో నుదుట ఏం వ్రాసివుంటే అది జీవితాంతం వరకూ అంతే. ఎలెనామాకరోవా విదేశాలకి వెళుతుందనీ, నేను ఇక్కడ గ్రాడ్యుయేట్ విద్యార్థిగానే వుండిపోవలసినవాడి నేయనీ, తెలుసుకుని సంతృప్తిపడ్డా. కాని, నీ వ్యవహారం ఏలావుంది.

షెకోవాయ్—(గంతువేసి) నేను ఫ్యాక్టరీలో పనిచేసేను. శ్రామికుణ్ణి. అయిపోయేను. ఐదేళ్ళుగా పార్టీలో సభ్యుణ్ణి. నా తల్లిపేరు చెప్పి నన్ను భయపెట్టలేవు.

కాస్టాల్‌స్కీ:—అందుకోసం కాదు. నే వచ్చింది. సోదరుడు మాదిరిగా నిన్ను హెచ్చరించడానికి వచ్చేను. నికోలాయ్! ఈపాటికి జాగ్రత్తపడు. పార్టీలో చేరేటప్పుడు తనవర్గమూలం కప్పిపుచ్చితే శిక్ష. పార్టీలోంచి తరమడమే. జాగ్రత్త. ఏసంబంధంలేనివాడిని వచ్చి చెప్పేను. క్షమించు నే నింక ఎప్పుడూ ఈవిషయం ఎత్తను. కంగారుపడకు.

(వెళ్ళిపోతాడు, తలుపు భళ్ళున వేసుకుని.)

షెకోవాయ్—(భయంతో) అబద్ధం, అబద్ధం ఆడుతూన్నాడు... అయినా నేను మూడేళ్ళపాటు ఫ్యాక్టరీలోనూ, అయిదేళ్ళు పార్టీలోనూ పనిచేసేను...పార్టీలో అయిదేళ్ళు!...మూడేళ్ళు ఫ్యాక్టరీపనిలో!... నేను ఇప్పుడే కంట్రోల్ కమీషన్ ఎదటికిపోయి స్పష్టంగా చెప్పివేస్తాను. వాళ్ళనే చెప్పనీ, తీర్పు. పరిస్థితులు తెలుసుకొని, నన్ను క్షమిస్తారు. ఓమారు చీవాట్లు పెడతారు. అంతతోసరి...(హడావిడిగా బట్టలు వేసుకుంటాడు.) నేను వచ్చి అన్నీ చెప్పేస్తా...మూడేళ్ళు ఫ్యాక్టరీలో... అయిదేళ్ళు పార్టీలో...నాతల్లి బ్రతికేవుంది...నా కొకరిభయంఏమిటి?... అన్నిసంగతులూ చేప్పేస్తాను. మూడేళ్ళు ఫ్యాక్టరీలో పనిచేసేను. అయిదేళ్ళుగా పార్టీలోవున్నాను. అదీసంగతి! అదే చెప్తుంది కథంతా.

(వెలుపలికి వెళ్ళిపోతాడు. తలుపు భళ్ళునధ్వని అవుతుంది. గది ఖాళీగావుంటుంది. అంతట నటాషా తన గది తలుపులమధ్యనుంచి తొంగి చూసి, గది కలయచూస్తుంది, విషయాలన్నీ ఆమె వింది.)

నటాషా—(భయంతో ఏడుస్తుంది.) నాన్నా! (గట్టిగా) నాన్నా! (వెర్రి ఎత్తినట్లు) నాన్నా! ఎక్కడి కెళ్ళేవు? ఎక్కడికి? నువ్వు శ్రామిక వర్గాన్ని మోసగించేవు! మన నాయకుణ్ణి మోసగించేవు! నాన్నా!... (ఏడుస్తుంది.)

[తెర]



# మూడో అంకం

## అయిదో రంగం.

(కాన్ఫరెన్సు గది. ఒక పెద్ద కాన్ఫరెన్సు టేబిలు. గోడదరినుంచి రంగంవైపుకి ఏటవాలుగా వుంటుంది. ఎదుటివేపున ఒక వరస కుర్చీలు వేయబడి వున్నాయి.

టేబిలువద్ద బొరోడిను, సెవిస్కీ, షెకోవాయ్, ఎలెనా, బోబ్రోవు, ప్రెసీడియంలో అవసర సభ్యుడొకడు కూర్చుండి వుంటారు. రంగం అంత సేపూ ఈతని పని టీ త్రాగి, మిఠాయిలు తినడమే పని.

ఒక ప్రక్కనున్న కుర్చీలలో కాస్టాల్‌స్కీ. కింబయీవు, వర్గాసోవులు కూర్చుండి వుంటాడు. వర్గాసోవు టెలిఫోనువద్ద కూర్చుండి, కార్యదర్శిలా వ్యవహరిస్తూంటాడు సెవిస్కీ అధ్యక్షుడు.)

సెవిస్కీ :—కామ్రేడ్ మాకరోవా మాట్లాడుతుంది.

బొరోడిన్ :—ఇక్కడికి మూడుగంటలనుంచి నడుస్తూంది ఈతంతు. (టెలిఫోను మ్రోగుతుంది. వర్గాసోవు సమాధానం చెప్తాడు.) దీనికేం అర్థం లేదు!

వర్గాసోవు— సెవిస్కీ ! నిన్ను పిలుస్తున్నారు.

సెవిస్కీ:—మాకరోవా! ప్రారంభించు. (టెలిఫోనువద్దకు వెడుతూ) నే వింటూనే వుంటాను.

ఎలెనా :—పైకి అంతా సవ్యంగానే కనిపించవచ్చు. మానవ పరివర్తనా పరిశోధక శాలలో—పరిశోధనలు సాగిస్తూ! రిపోర్టులు వ్రాస్తూ, ప్రశ్నావళులుపూర్తిచేస్తూ, రక్తపరీక్ష సాగిస్తూ—అరుజట్లవాళ్ళం—రాత్రీ పగలూ పనిచేస్తున్నాం. మనం ప్రోగుచేసిన విషయాన్నంతటినీ—కట్టుకట్టి, ప్రొఫెసరు తన గదిలోకి తీసుకుపోతాడు. తలుపులు బిడాయించుకు స్వయంగా పనిచూచుకుంటాడు. ఫ్యాక్టరీలకి ముడిసరుకు వుత్పత్తిచేసి యిచ్చే

నీగ్రోలకీ, మన వైజ్ఞానిక విద్యార్థులకీ తేడా ఏముందీ?......(బల్ల గుద్దు తుంది.( ఆ ఫ్యాక్టరీలో ఏం సరుకు తయారవుతూందో మాకు చెప్పాలి. బూట్లా, కొవ్వువత్తులా, విషవాయువులా...

కాస్టాల్‌స్కీ—మాకంటే, నీ వుద్దేశ్యం?...

ఎలెనా—పార్టీసభ్యులు...వైజ్ఞానికదళసభ్యులు...

కాస్టాల్‌స్కీ—నేనూ ఒక దళంలో సభ్యుడినే. నీ యీ ఎదు రోక్తులు మాయిష్టం మీద జరపడం లేదని చెప్తూన్నా. స్పష్టంగా, చెప్తూన్నా విను. మాదళంవాళ్ళం ఎవ్వరం...

ఎలెనా—లేబరేటరీదళసభ్యుల కాన్ఫరెన్సుకి ప్రతినిధిగా మాట్లాడు తూన్నా. నెవిస్కీ, అధ్యక్షుడివి నీవేనా?

నెవిస్కీ—(టెలిఫోనుదగ్గరనుండే) ఒక్కనిముషం! నిముషం! బడ్జె టునిగురించి...(రిసీవరు తగిలించేస్తాడు.) ఏ మయినా ప్రశ్నలున్నాయా? (బల్లవద్దకు వచ్చి తన కుర్చీలో కూర్చుంటాడు.)

ఎలెనా—నెవిస్కీ! ఇంకా నాచెప్పడం పూర్తికాలేదు. ప్రొఫెసరు తన గదితలుపులు తెరచి, లేబరేటరీవారు సప్లయిచేసిన వివరాలను ఏవిధంగా ఉపయోగిస్తూన్నాడో మాకు చెప్పాలి.

బొరోడిన్—మీ అందరికీ తలోకశాస్త్రం పంచిపెడతా ననుకుంటు న్నావేం? ఇక్కడికి 20 ఏళ్ళనుంచి, నాకు కావలసినవిషయంసేకరిస్తూన్నా. అదంతా దొంగిలించుదామనా? నీ చేతికిస్తే ఏంచేస్తావేం? పత్రికలకిస్తావా? నేను ఒప్పుకోను. కులకుల్ని తరిమినట్లు మమ్మల్ని తరమలేరు. మా ఆస్తులు లాక్కోలేరు. (నుదురు తట్టుకుంటూ) మాసంపదలన్నీ ఇందులోవున్నాయి.

కింబయీవు—ఇన్‌స్టిట్యూటు బొరోడిన్‌ది కాదు. ప్రభుత్వానిది.

బొరోడిన్—నేను ఎప్పుడు ఏది చేసినా ప్రభుత్వానికే. ప్రభు త్వానిదంటూన్న ఇదంతా నాదేనన్న సంగతి మరవకు. చప్పిడి దవడలూ నువ్వూ.

కింబయీావు—ఈ చప్పిదపడలు. ఈరక్తం ఇదంతా నాస్వంతం. ఒక బీదరైతుది. ప్రొఫెసర్ బొరోడిన్!

కాస్టాల్‌స్కీ—ప్రభుత్వం మీ సేవకు సంతోషిస్తుందనే నావిశ్వాసం.

బోబ్రోవు—చూద్దాం.

కాస్టాల్‌స్కీ—కాని, ప్రొఫెసర్ బోబ్రోవు విషయంలో ప్రభుత్వం సంతుష్టిచెందలేదనే విషయం అందరూ ఎరుగుదురు ..(వెక్కిరింతగా) ప్రెసీడియంలో బాధ్యతగల సభ్యులు. పోర్టుఫోలియోలేని అమాత్య శేఖరులు......

ఎలెనా—మా 'డిమాండ్'......

బొరోడిన్—మీ 'డిమాండ్'లు పనికిరావు (నెవిస్కీ చేతిలోని గంట లాక్కొని నేలబెట్టి కొడతాడు.) కామాలూ, ఫుల్‌స్టాపులూ, ఎక్కడపెట్టాలో ముందు నేర్చుకో. ఆ తర్వాత 'డిమాండ్' చేద్దువుగాని. కానీ...ప్రోగుచేసిన వివయానికి ప్రతి తీసుకో. నీ యిష్టం వచ్చినట్లు పనిచెయ్యి...నీకు నువ్వే కనిపెట్టు, ప్రకృతి మార్గాలని—బోబ్రోవులూ - వారూ ఉన్నారుగా—ఆఖరున చూద్దాం. ఎవరి అభిప్రాయాలు సరిగ్గా వుంటాయో. అంతేకాని, ఇతరుల జేబులు తడమబోకు. పోలీసుల్ని - సైనికుల్ని పిలవవలసి వస్తుంది.

(నెవిస్కీ ఎంతో శాంతంగా నేలమీదనుంచి గంట తీసుకుంటాడు.)

బోబ్రోవు—నా నిర్ణయాలకి నే నిదివరకే వచ్చేను.

కాస్టాల్‌స్కీ—అవి పెట్టుకొని ఇంటిదగ్గరకూర్చో.

కింబయీావు—నిన్నెవరూ మాట్లాడమనలేదు. నోరుముయ్యి!

ఎలెనా—(చీత్కారం చేస్తూ) నెవిస్కీ! సభని సక్రమంగానడుపు. నిన్ను తగలెయ్య!

బొరోడిన్—ఇన్‌స్టిట్యూట్ యొక్క కార్యనిర్వాహకవర్గసమావేశం లోనైనా తిట్లు మానడం మంచిది.

నెవిస్కీ—(గంట తెగమ్రోగించి) కామ్రేడ్స్! ఆర్డర్! ఒకరి తర్వాత నొకరు మాట్లాడండి! (టెలిఫోను మరల మ్రోగుతుంది.) పని సాగించండి......

వర్గాసోవు— నెవిస్కీ! నువ్వు రావాలి.

నెవిస్కీ—(టెలిఫోన్ వద్దకుపోయి) కానియ్యండి. క్రాప్రేడ్స్! ఒక్క నిముషంలో వస్తూన్నా.

బొరోడిన్—(బోబ్రోవుతో) నీ నిర్ణయాలేమిటి చెప్పు. ఓమాటు వింటాను.

బోబ్రోవు—ఇంత కాలమూ నోరుమూసుకు వూరుకున్నా. ఇంత కాలమూ అతివోరిమి చూపేను. చాలాకాలం! ఇవాన్ ఇలిచ్ యొక్క ప్రఖ్యాతి—ఆయనకీ, నాకూవున్న సంబంధం - కుటుంబమర్యాదలు - వీటన్నింటిమూలంగా ప్రొఫెసరు బొరోడిన్ కి వ్యతిరేకంగా ఇంతకాలమూ నోరు మెదపలేకపోయేను. కాని, ఇవాన్ ఇలిచ్ వైజ్ఞానిక విషయంలో గొప్ప తప్పు చేస్తూన్నాడు. పశువులకుండే ఉద్రేకాన్నే మానవులకి కూడా వుండనడానికి ఆతను పొరపాటుపడుతూన్నాడు. ఈపొరపాటుకి కారణం ఆయనకి గలరాజకీయాభిప్రాయాలే. వానికి వ్యతిరేకంగా నేను నిలబడి తీరుతా.

కాస్టాల్ స్కీ—కానియ్యి. విధ్వంసకుని ప్రియశిష్యుడివికదా?

కింబయీవు—ఏమిటి పేలేవు? మళ్ళీఅను!

బొబ్రోవు—(కాస్టాల్ స్కీతో) కోటోమిన్ పై నేను వ్రాసిన విమర్శ చదివేవా?

షెకోవాయు—అది సమయం మించి బయట పడింది.

ఎలెనా—మనం ఇప్పుడు లేబరేటరీని గురించి మాట్లాడుతూన్నాం. కోటోమిన్ సంగతి అప్రస్తుతం - సంబంధంలేనిది. బొరోడిన్ పద్ధతి మాకు అంగీకారంలేదు. మానవుని — వర్గసంబంధాలు గణించకుండా — వట్టిమానవ మాత్రుని ప్రవర్తన ఎత్తుకుంటున్నావు. వర్గరహితమైన చైతన్యంకోసం ప్రయత్నిస్తూన్నావు. నీ వుద్దేశ్యం ప్రకారం చూస్తే విప్లవం క్రోధానికి ఫలితంగా కనపడవచ్చును. సోషలిస్టుపోటీకి స్త్రీపురుష సంబంధాలు వెతకవచ్చు. షాక్ - బ్రిగేడ్లపని ఆకలిఫలితంగా తోచవచ్చును. కాని, మా కీ రాద్ధాంతం రాజకీయంగా హానికరం.

బొరోడిన్—నేను ఏనిర్ణయానికి వచ్చేదీ నీకు తెలియదుగదా? ఏమంటే—ఆవిషయం నాకే తెలీదు.

బోబ్రోవు—ఆ నిర్ణయాలు ఏలావుండాలో కాస్టాల్‌స్కీ సూచించేడుగా. ప్రస్తుత పరిశోధనావిధానానికి అవమానం కలిగించే నిర్ణయాలు.

కాస్టాల్‌స్కీ—నోరుముయ్యి. సొహంద్రల్! నన్ను అవమానం చేస్తావూ? అనుమాన పురుషుడివి—వేషధారి విధ్వంసకుడివి! వెనక దిక్కులేని గ్రాడ్యుయేట్ స్టూడెంటుమీద కసితీర్చుకోడానికి ఇదాపద్ధతి?

ఎలెనా—నోరుముయ్యి!

కాస్టాల్‌స్కీ—ప్రెసిడెంట్! నన్నవమానపరచినందుకు బోబ్రోవుని అరెస్టు చెయ్యమనికోరుతున్నా. ఈవిషయం మినిట్సులోకి చేర్చాలి. నన్ను హింసిస్తూన్నాడు...

కింబయిావు—వీడు బోబ్రోవుని విధ్వంసకుడన్నాడు...కాస్టాల్‌స్కీని తిన్నగా ప్రాసిక్యూటర్ దగ్గిరికి ఈడ్చుకుపోతా.

బొరోడిన్—నేను ప్రభుత్వానికి సేవచేయదలచుకున్నాను. ప్రజలు తమ నడవడిక బాగుపరచుకోవాలని నాకోరిక. కాని, మీరు నాపనికి అడ్డం వస్తూన్నారు. నాపని సాగనియ్యడం లేదు.

కాస్టాల్‌స్కీ—బోబ్రోవూ - మాకరోవాలు నీవంటే అసూయ పడుతూన్నారు.

బొరోడిన్—కావచ్చు. వాళ్ళవుద్దేశ్యం బహుశా ఇదైవుంటుంది: ఈ ప్రొఫెసరు మనకి కొరకబడకుండావున్నాడు. ఏడిపిద్దాం - అని అందుకే అంతూపొంతూలేని సమావేశాలతో పీక్కుతింటూన్నారు... కాలం వ్యర్థంచేస్తున్నారు...వాళ్ళప్రయత్నాలు ఫలించేయి. నా బుర్ర అంతా చెడిపోయింది. అయినా మీరంతా శతృశిబిరంలో నేవుంటూమంటారేం? ఎందుచేత? చెప్పండి!

కాస్టాల్‌స్కీ—నిన్ను బయట పెట్టడానికి—

ఎలెనా—నిజం. మా అభిప్రాయాలు సరియని తేలుతే నిన్ను బయాట పెట్టి తీరుతాం.

(నిశ్శబ్దం... టెలిఫోనుకద్ద నెవిస్కీ గొంతు మాత్రం వినబడుతూంది.]

నెవిస్కీ—గ్రలీస్‌తో గట్టిగా చెప్పండి. ఆతనితో నేను మాట్లాడేను... కుంరేళ్ళ గుడిసె కురుస్తూంది.

(బొరోడిన్ నెవిస్కీ వద్దకు పరుగెత్తివెళ్ళి టెలిఫోన్ రిసీవరు లాక్కొని, దానిని ఊడపీకి నేలబెట్టి కొడతాడు.)

బొరోడిన్—నీకుంరేటి గుడిసెలు కూలిపోయిరి. గ్రలీస్‌ని గంగలో దిగమన. ఆఖరుమాట చెప్తూన్నా విను. మాకరోవా కావాలా, నేను కావాలా? చెప్పు.

కింబయీవు—(ఎగిరి కుర్చీమీద నిలబడి) ఏయ్, బెదరింపులు పనికి రావు. నీవంటి పెంకిరకాల్ని 1920 లో గోడకి జేరబెట్టి కాల్చి పారేసేం.

బొరోడిన్—స్కౌండ్రల్స్!

(తలుపులు విశిరికొడుతూ బొరోడిన్ లోనికి వెళ్ళిపోతాడు. వర్గాసోవు వెంబడిస్తాడు.)

నెవిస్కీ—కామ్రేడ్ కింబయీవ్! నువ్వు మీటింగ్‌లోంచి వెంటనే వెళ్ళిపోవాలి.

కింబయీవు—పోషకవర్గానికి సంబంధించిన విషయం ఒకటుంది. ప్లాన్‌లు తయారైనాయా?

నెవిస్కీ—నీ పోషకవర్గంతో మాకు సంబంధంలేదు. అదంతా అర్థంలేనిపని. మీటింగులోంచి వెంటనే వెళ్ళిపోవాలి. బొరోడిన్‌కి క్షమార్పణ చెప్పాలి.

కింబయీవు—కావలసివస్తే నువ్వు వెళ్ళి చెప్పుకో. ఏలేనా చాలా తెలివైనది. బోబ్రోవు దిట్టమైనవాడు. వాళ్ళు మంచి చెప్తూన్నా, నీబుర్రకి ఎక్కడంలేదు.

నెవిస్కీ—(అరుస్తాడు) నిన్నికక్కడనుంచి గెంటేస్తా.

(కింబయీవు కాజక్ భాషలో తిట్టూకుంటూ గదివదలిపోతాడు.)

బోబ్రోవు— నేను మళ్ళీ చెప్తూన్నా : ఈ లేబరేటరీ మనకి విరుద్ధమైన రాజకీయ ప్రచారంకోసం సంస్థాపించేరు.

కాస్టాల్‌స్కీ— నువ్వు 'లఖీ' చెప్పు. సోవియటు ప్రభుత్వం నమ్మదు.

బోబ్రోవు— సోవియటు ప్రభుత్వానికి కాస్టాల్‌స్కీల రక్షణం అవసరంలేదు.

కాస్టాల్‌స్కీ— బోబ్రోవులు రక్షించాలని బాధ పడుతూంది కాబోలు నేం?

ఎలెనా— లేబరేటరీ తిరిగి నిర్మించాలి. బొరోడిన్ తన ఆట కట్టిపెట్టాలని మేము కోరుతూన్నాం.

నెవిస్కీ— ఇంత డబ్బు ఖర్చు పెట్టేక ఇప్పుడు మరల నిర్మాణమా? పనికిరాదు. ఇన్ స్పెక్టర్లు నన్ను బ్రతికివుండగానే పేల్చి చంపుతారు. అది పనికిరాదు.

షెకోవాయ్— మీటింగ్ తాత్కాలికంగా నిలుపు. పార్టీ ఫ్రాక్షన్ సమావేశపరుద్దాం.

నెవిస్కీ— (సంతృప్తితో) బాగుంది. ఒక్క క్షణం విశ్రాంతి.

(నెవిస్కీ, షెకోవాయ్, ఎలెనాలు వెడతూంటారు. షెకోవాయ్. నెవిస్కీతో మాట్లాడుతాడు)

షెకోవాయ్— మా కరోవా బోబ్రోవునా? ఏమిటీ సమ్మేళం?

అవసరసభ్యుడు— (లేచి) టీ అయిపోయింది. మిఠాయిలు అయిపోయేయి. ఇంక నే పోవచ్చు. వోటింగ్ వస్తే... ఔను – అన్నవాళ్ళది నావోటు. (వెడతాడు)

[కాస్టాల్‌స్కీ, బోబ్రోవులు అటూయిటూ పచారుచేస్తుంటారు. వాలంటీనా వస్తుంది.]

వాలంటీనా— 'లోహెన్‌గ్రిన్' కి వెళ్ళడానికి షెకోవాయ్‌కి కూడా ఓటిక్కట్టు తీసుకున్నా. ఓమాటు చెప్తారా, ప్రయాణం అయి వచ్చేనని.

బోబ్రోవు— (కోపంతో) నువ్వే చెప్పుకో.

వాలంటీనా—అయితే ఇంకా మీ కోపం తగ్గలేదు? ఎప్పుడూ అంతే. కానీండి. హెర్మన్! ఈటిక్కట్టు ఇచ్చి కాస్త చెప్తావా?

కాస్టాల్‌స్కీ—అంతకన్నానా?

బోబ్రోవ్—(వెర్రికోపంతో, కాస్టాల్‌స్కీని కొట్టడానికి కుర్చీ ఎత్తుతాడు.) లేచిపో. లేకుంటే తలబద్దలుకొట్టేస్తాను.

కాస్టాల్‌స్కీ—అల్లాగేం. చూద్దాం. (ద్వారంవేపు నడుస్తూ) ఊహూం! (వెడతాడు.)

వాలంటీనా—అసూయ అంతా కుర్చీమీద చూపుతూన్నారే. ఆహాహా! (వెక్కిరింతగా) నికోలాయ్ మీరు నిష్కారుణులు.

బోబ్రోవ్—వాలంటీనాఇవానోనా!

వాలంటీనా—నాపుట్టింటిపేరు ఇవానోనా. మాయింటిపేరు కాశ్యానోవిచ్. ఏడాదికి 'కాశ్యాణ' నాలుగుమార్లు వస్తుంది. అటువంటి కుటుంబంలోనివానికి అసూయ. స్పానిచ్ జాతికి చెందిన మనిషే అయివుంటే Ventura Garcia Calderon··· ఆకుర్చీతో సాముచేసినా క్షమించివుందును.

బోబ్రోవ్—ఈపాటికి చాలునులే. నీసంగతి కాదు.

వాలంటీనా—ఇది మరీబాగుందికాదూ? (నవ్వుతుంది) నీఅసూయ కూడా గంభీరమైనది కాదు. అసూయలోకూడా అందం, ఆనందంవుంది. ఫ్యాక్టరీలో అన్నం అందంగా వొడ్డించాలని పేచీపెట్టేవాళ్ళం. అభోజనశాల శుభ్రంగావుంటే ఉత్పత్తిలో అభివృద్ధి కనబడుతుంది. కాని. . మీరు...కుర్చీమీద మీకసిఅంతా తీర్చుకుంటున్నారు.

(కాస్టాల్‌స్కీ, బొరోడిన్, వర్గాసోవులు వస్తారు.)

బొరోడిన్—వాలంటీనా! నీమగడు ఏరుదాటి తెప్ప తగలబెట్టే రకం. నీతండ్రి బ్రతికివుండగానే పాతిపెట్టాలనిచూస్తున్నాడు. త్వరలోనే అతగాడు పీపుల్సు కమిస్సార్ అయిపోతాడు - అప్పుడింక కనిపిస్తే షేక్‌హ్యాండ్ కూడా ఇవ్వడు. అందుచేత నేను ఇప్పుడే అతనితో చేయి కలపడానికి నిరాకరిస్తున్నా.

వాలంటీనా—పరాయివాళ్ళ సంగతులు నాతో చెప్పకు.

బొరోడిన్—నీకూ పరాయివాడు అయిపోయేడు.

బోబ్రోవు—ప్రొఫెసర్ బొరోడిన్! ఒంటరిగా పలకరించేవాకు కూడా లేకుండా తిరగవలసినరోజులు నామటుకి తప్పిపోయినాయి. ఇంక నీవంతు వచ్చింది. కాని, జాగ్రత్త! మతిచెడకుండా...

(షెకోవాయ్, నెవిస్కీ, ఎలెనాలు వస్తారు. ఇతరులుచూడకుండా వాలంటీనా తప్పుకుంటుంది. కింబయిూవుద్వారంలో ప్రత్యక్షంఅవుతాడు.)

నెవిస్కీ—మీమీచోట్లలో కూర్చోండి. ప్రెసీడియంలోని పార్టీ ఫ్రాక్షను పరిస్థితులన్నీ విమర్శించింది. చాలా సూచనలు ఆలోచించేం. వరసగా చదువుతా వినండి;

'ఒకటి—ఇన్స్టిట్యూట్‌లోని విప్లవనిరోధకులతో స్నేహంచేసి, కామ్రేడ్ మాకరోవా లేబరేటరీయొక్క కార్యక్రమాన్ని అనుమానిస్తుండడంచేత, ఆమెను మేనేజరుపదవినుంచి తొలగించాలి.

రెండోది—డిపార్టుమెంటు అధ్యక్షుడు కామ్రేడ్ షెకోవాయ్, లేబరేటరీని నడిపించవలసిన బాధ్యత తీసుకుని, షాక్‌బ్రిగేడ్‌లని ప్రోత్సహించి ఉత్సాహంగా పనిచేయించాలి.

మూడు—మానేజ్‌మెంటుకి, అర్హతలుగల పనివారు కావాలంటూ ఆర్డర్లు వస్తున్నాయి. పార్టీసభ్యులయిన వైజ్ఞానిక పరిశోధకులు రాష్ట్రాలలో చాలచోట్లకి కావలసివున్నారు. ఆకారణంచేత కామ్రేడ్ మాకరోవాని సారటోవ్ యూనివర్సిటీకి అధ్యాపకురాలినిగా పంప నిర్ణయం.

నాలుగు—ఈనిర్ణయాలకి అనుకూలంగా విదేశాలకి పంపవలసిన పని కాస్టాల్‌స్కీకి మార్చి, దానిని పైఅధికారులికి పంపించాలి.

రిపోర్టులో మాకరోవా వ్యతిరేకాభిప్రాయాలు నమోదు చేయబడ్డాయి.

బొరోడిన్—ఎక్సలెంట్! నికోలాయ్ పెట్రోవిచ్! బోరిస్ నెమియోవిచ్! అభివందనాలు మీయిద్దరికీ.

కింబయిూవు—(నిరుత్సాహంతో) ఏంపని ఇది? అరెరే! తలనొప్పి వస్తోంది.

సెపిస్కీ—ఇంకేమయినా ప్రశ్న లున్నాయా? వోటుకి పెడుతూన్నా. మొదటిసూచనకి ఎంతమంది అంగీకరిస్తారు? (అయిదుచేతులు లేస్తాయి) మూడోసూచనకి అంగీకారం ఎందరు? (అయిదుచేతులు లేస్తాయి) నాలుగోసూచనకి? (నాలుగుచేతులు లేస్తాయి. బోబ్రోవు వోటు చెయ్యడు.) మీటింగు పూర్తి అయింది.

(అక్కడున్నవారంతా లేచి ప్రయాణం అవుతారు. కాస్టాల్‌స్కీ, షెకోవాయ్‌ని సమీపిస్తాడు.)

కాస్టాల్‌స్కీ—సోదరా! సమస్తే.

షెకోవాయ్—నన్ను పీడించకు.

కాస్టాల్‌స్కీ—వాలంటినా మీకోసం ఎదురుచూస్తోంది.

బొరోడిన్—(ఎలెనాతో) సెలవు. ఎలెనా! సార్‌టోవ్‌నుంచి ఎప్పుడేనా జాబులు వ్రాస్తుండు.

(వాలంటీనా షెకోవాయ్‌తో వెలుపలికి పోతుంది. వారివెనుక బోబ్రోవు, ఎలెనా, కింబయిూవులు - మినహా మిగిలినవారంతా వెడతారు. నిశ్శబ్దం.)

ఎలెనా—మనప్రాణాలు పీల్చేసేరు. (బోబ్రోవువద్దకువచ్చి, అతని చేయి పట్టుకొని) 'విద్రోహీ!' వాళ్ళు నన్ను పార్టీనుంచి తరుముతారో, నువ్వూ నేనూ బొరోడిన్‌గుట్టు బయటపెడతామో చూడాలి.

కింబయిూవు—నువ్వు పార్టీని విడవవద్దు. పార్టీలో వుండితీరాలి. వెళ్ళు. పార్టీవాళ్లు వచ్చి జోక్యం పుచ్చుకొనేలాగచూడు. మనప్రాక్షన్ వాళ్ళు ఏమీ చెయ్యలేకపోతే రెజినల్ కమిటీనికదుపు. రెజినల్‌కమిటీ కూడా ఏమీ చేయలేకపోతుంది. నడు జిల్లాపార్టీకి. జిల్లావాళ్ళు ఏంచేయలేకపోతే సెంట్రల్‌కమిటీకి తెలియబరుచు. నేను స్వయంగా స్టాలిన్‌ని కలుసుకువస్తా.

ఎలెనా—ఒక్క క్షణం పోగొట్టుకోకూడదు. మన కొత్త స్థానాలలో నుంచే బోరోడిన్‌ని ఎదిరించాలి. పత్రికలలో చర్చలు రేపుదాం. మన పోరాటాన్ని ఇన్‌స్టిట్యూట్ వెలుపలనుంచి సాగిద్దాం. నే వెళ్లిపోయేలో పున మాట్లాడవలసిన సంగతులు చాలావున్నాయి. నడు పోదాం.

బోబ్రోవు—ఏమయితే జౌగాక, న్యూరుమూసుకు పడివుండవలసిన స్థితి తప్పిందని సంతోషిస్తున్నా.

కింబయీవు—ఆ అవస్థ తప్పింది. కామ్రేడ్ బోబ్రోవ్! ఇక గతం తలుచుకోకు. అటువేపు ఇంక దారిలేదు.

(బోబ్రోవు, కింబయీవు, ఎలెనాలు వెడతారు. ఒక్క క్షణం రంగంఖాళీగావుంటుంది. అప్పుడు వర్గాసోవు, కాస్టాల్‌స్కీని వెంటపెట్టు కొని వస్తాడు.)

కాస్టాల్‌స్కీ—బోబ్రోవుని ఓడించడానికి సహాయం చేసేవు నాకు లేబరేటరీలో పనిఇచ్చేవు. షెకోవాయ్ రహస్యం కనిపెట్టి నాచెవిని వేసేవు. దుఃఖజీవియైన ఒక విద్యావంతుడి విషయంలో నీకింత దయ ఏల కలిగిందో నాకు అర్థం కావడంలేదు.

వర్గాసోవు—నీ ప్రయాణానికి కొంచెం 'వలూటా' ధనం ఇస్తాను. నీ 'విసా'కి, 'ప్యాస్‌పోర్టు'కి నేను తంటాలు పడతాను.

కాస్టాల్‌స్కీ...చాలామంచివాడివి. మేధావి వర్గానికి నిజమైన మిత్రుడివి.

వర్గాసోవు—నేనూ ఆవర్గానికి చెందిన వాడినే...నేను వైజ్ఞానిక పత్రికలకి వ్యాసాలు వ్రాస్తూండేవాడిని...వ్యాసాలు...పందెపు గుర్రాల్ని గురించి...నావద్ద మంచి పందెపుగుర్రాలుండేవి, ఆరోజులు వెళ్ళిపోయేయి. వాటిని చక్రవర్తివద్దకి తీసుకుపోతూండే వాడిని...

కాస్టాల్‌స్కీ—నీ ఋణం తీర్చుకోలేను.

వర్గాసోవు—తీర్చుకోవాలంటే దారిలేకపోలేదు ... వుంది...(రహస్యంగా) ఒక సందేశం వెళ్ళేటప్పుడు పట్టుకు వెళ్ళాలి.

కాస్టాల్‌స్కీ—(భయపడి) వద్దు వద్దు. నేనే సంఘాలలోనూ చేరను.

వర్గాసోవ్—హెర్మన్! అప్పుడే కంగారుపడకు. ఎవ్వరితోటీ సంబంధం లేకుండా నువ్వు ఇంతకాలంనుంచీ గడుపుతూన్నావు, నిన్ను మా లెక్కల్లో చేర్చుకున్నాం.

కాస్టాల్‌స్కీ—అదేమిట్?

వర్గాసోవ్—మాకుమాత్రం వారసులొద్దూ? అర్హులయిన వారసులు దొరకడం కష్టసాధ్యం. కనక అసంతృప్తి చెందిన వారిని దగ్గరకి పిలిచి మాట్లాడి...సాయంకాలంరా...అన్ని విషయాలూ స్పష్టంగా మాట్లాడుకో వచ్చు.

కాస్టాల్‌స్కీ—ప్రమాదం ఇది. బ్రతకడంకోసం...

వర్గాసోవ్—చావాలని నాకు మాత్రం సరదాయా? ఇంతవరకు అన్నీ సవ్యంగానే జరిగేయి. దేవుడు దయతలుస్తే ముందుకూడా సరిగ్గానే వుంటుంది. (సెలవు తీసుకుంటూ తలవొంచుతాడు.) నీ ఏకాంతజీవనం ఈవేళతో ఆఖరు...

[తెర]

ఆరో రంగం.

(బరోడిన్ ఇల్లు. ఉద్రేకపూరితుడై గదిలో అటూయిటూ పచారు చేస్తూంటాడు చేతిలో వార్తాపత్రికవుంది. కాస్టాల్‌స్కీకి చదివి వినిపించు తూన్నాడు.)

బొరోడిన్—"వేలూలక్షలూ కొలదిగా, ఎలకలవలె వాళ్ళు వైజ్ఞానిక రంగంలోకి దూరుతారు......" నా కూతురు పూర్వపు మగడు, అతని యందుంచిన విశ్వాసం దుర్వినియోగం చేస్తున్నాడు. ఇంట్లో జరిగిన ఒక సంభాషణని ప్రొఫెసర్ బోబ్రోవు పత్రికలకి ఎక్కించేడు. ఎందుకు? నిన్ను విదేశాలకి పోకుండా చెయ్యడానికి! (పత్రిక దులుపుతాడు.) మన కళ్ళ ఎదటనే ప్రజలు కుళ్ళిపోతూన్నారు. గాలి అంతా కుళ్ళుకంపు కొట్టించేస్తున్నారు.

కాస్టాల్‌స్కీ—అప్పుడే ఒకన్యూస్ పేపరు రిపోర్టరు ఇన్‌స్టిట్యూట్ ఆఫీసుకి వచ్చేడు. వర్గాసోవుకోసం చాలాసేపు చూస్తున్నాడు కాని, ఆతడు పొద్దుటే ఎక్కడికో వెళ్ళిపోయాడు.

బొరోడిన్—ఎవ్వర్నీ నమ్మవద్దు. స్నేహితులుకూడా మోసం చేస్తారు. (పత్రిక ఆడిస్తాడు.) కోటోమిన్ విచారణసాగుతూంది. విధ్వంసకుల పార్టీలో ఆత డొక సభ్యుడుట! అంత మంచివాడు! అల్లాంటివాణ్ణి కూడా ద్రోహి అనేసేరు!

కాస్టాల్‌స్కీ—వైజ్ఞానిక ప్రపంచంయొక్క నాశనాన్ని ఎదురు చూస్తూంది జనం.

బొరోడిన్—నాపని త్వరగా పూర్తిచేద్దామని రాత్రిం బగళ్ళు పనిచేస్తున్నా. మూడు నెలలలో నా నిర్ణయాలు బయట పెట్టేస్తాను.

కాస్టాల్‌స్కీ—ఏ సోవియట్ పత్రికా మీరచనని ప్రకటించదు.

బొరోడిన్—నేను లండన్‌లో ప్రకటింపిస్తా.

కాస్టాల్‌స్కీ—సరిహద్దుదాటేలోపల ప్రభుత్వం కాగితాలు స్వాధీన చేసుకుంటుంది.

బొరోడిన్—బహిరంగసభలో ఉపన్యాసం ఇచ్చేస్తాను.

కాస్టాల్‌స్కీ—ఊరిఖే గొంతు బద్దలు చేసుకోవాలి.

బొరోడిన్—నాయింట్లోనే అరుస్తా. (నెత్తి మొత్తుకుని) నే నో రిపోర్టువ్రాస్తా—ఛా వెధవ రిపోర్టు—వర్తమాన ప్రవర్తనకి మూలకారణాల మీద రిపోర్టు. అక్కడ స్టెనోగ్రాఫర్లు - విదేశ పత్రికాప్రతినిధులువుంటారు. అది మంచి అభిప్రాయం... హెర్మన్! ఉన్న ఇబ్బం దేమిటంటే, వాళ్ళు నన్ను అరెస్టుచేస్తారేమోనని...

కాస్టాల్‌స్కీ—వైజ్ఞానిక విషయాలు ప్రకటించినందుకు అరెస్టుచేస్తే విదేశాలలోని మీ మిత్రులు వూరుకుంటారూ? పెద్దగా వ్యతిరేక ప్రచారం సాగిస్తారు... మిమ్మల్ని ముట్టుకోడానికి ఎన్ని గుండెలు కావాలి. గొప్ప గొప్ప శాస్త్రవేత్తలు మీపక్షం తీసుకుంటారు. గురుజీ! మిమ్మల్ని జెండా మాదిరిగా భుజాన పెట్టుకుంటారు.

బొరోడిన్—నా కున్న స్నేహితులే స్వల్పం. నన్ను సమర్థిస్తూ వ్రాయగలవాళ్ళు వారిలో లేరు.

కాస్టాల్‌స్కీ—కాని, ఇదివరకే వ్రాయబడిపోయింది. ష్! (తలుపు దగ్గరకు వెళ్ళి ఎవ్వరూ లేరుగదా యని ఆలకించి తిరిగివస్తాడు.) చూడండి! (ఒక వ్రాత కాగితం తీసి ఇస్తాడు.) "నాగరిక ప్రపంచానికి..." చదవండి! బొరోడిన్ చదువుతాడు.) రష్యన్ పేర్లు రహస్యంగా వుంచబడతాయి.

బొరోడిన్—"ప్రొఫెసర్ బొరోడిన్ ఖైదుచేయబడ్డాడు"...ఏదీ లేదుగా?

కాస్టాల్‌స్కీ—మీ ఉపన్యాసం పూర్తి అయ్యేక ఈ కాగితం ప్రకటించబడుతుంది.

బొరోడిన్—అయితే నేను అరెస్టుచేయబడతాననే అంటావు?

కాస్టాల్‌స్కీ—మేము మిమ్మల్ని 'విడిపించుత'ము కాదూ? చదవండి!

బొరోడిన్—ఉహూ!. "వాళ్ళు విజ్ఞానంపీక పిసికివేస్తున్నారు."—కాని మన ఇన్‌స్టిట్యూట్ విప్లవంవచ్చేక నేకదూ ప్రారంభించబడింది.

కాస్టాల్‌స్కీ—చదవండి.

(వర్గాసోవు లోనికి ప్రవేశిస్తాడు. కాస్టాల్‌స్కీ గభీమని కాగితం లాగివేసుకుంటాడు.)

వర్గాసోవు—హో! (కూర్చుండి) ఛా!

కాస్టాల్‌స్కీ—ఏమిటది?

వర్గాసోవు—కాగితం జాగ్రత్తచేసే పద్ధతి అదేనా? అందరికీ కనిపిస్తోంది.

బొరోడిన్—సెమియాన్! తెగతిరుగుతున్నావు కాబోలు నేం?

వర్గాసోవు—చచ్చిపోతూన్నా. ఏలాగైతేనేం ప్యాస్‌పోర్టు సంపాదించేం. రేపుమధ్యాహ్నం 12 గంటలకి నీకు చేరుతుంది. దానితో పే 'విసా' కూడా వస్తుంది. ఇదిగో 'వాలూటా' (డబ్బు ఇస్తాడు.)

కాష్టాల్‌స్కీ—సెభాష్.

బొరోడిన్—ఎల్లా సంపాదించగలిగేవు. కాస్త చెప్పు.

వర్గాసోవు—తర్వాత చెప్తా. ఇప్పుడు తీరిక లేదు. హెగ్మన్ వెళ్ళి పోవలసిన సమయం వచ్చింది. నోటీసు పత్రికలకి ఎక్కింది అంటే దెబ్బ తిన్నాం అన్నమాటే. పత్రికలనుంచి...ఇతరచోట్లకి పాకిందా చెడిందే. బోబ్రోవు బహు కట్టు దిట్టంగా చేసేడు. చేసేడు...ఇదిగో చదివి చూడు. ఇవాన్ ఇవిచ్ మీద—మాకరోవా వ్రాసిన వ్యాసంయొక్క—ప్రూఫులు—ఒక స్నేహితుడు తెచ్చి యిచ్చేడు...ఇదిగో...(ఇస్తాడు).

కాష్టాల్‌స్కీ—(ప్రూఫులు తీసుకుని) "వృత్తి ప్రత్యేకతలు వర్గ శత్రువుయొక్క యుద్ధరంగం" ఇది శీర్షిక కాదు. కాలు దువ్వడం, పేచీకి.

బొరోడిన్—ఏదీ చూడనీ నన్ను. (ప్రూఫులు లాక్కుంటాడు.) వెళ్ళిపోతూ ఈ ముసిలాడిని రాళ్ళతో కొట్టి చంపుతూన్నారన్నమాట.

వర్గాసోవు—పత్రిక బయటపడడం కొంచెం ఆలస్యం అవుతుంది. అంటే రావలసిన తేదీకి ఒక నెలదాటి వస్తుంది.

కాష్టాల్‌స్కీ—నెల్లాళ్ళుపోయేక, ప్రొఫెసర్ బొరోడిన్‌ని నోరెత్త నియ్యరన్నమాట.

వర్గాసోవు—నే నెరిగివున్న ఓ పెద్దమనిషి ఇప్పుడే టెలిఫోనులో ఒకవార్త చెప్పేడు. గ్రాడ్యుయేట్ స్టూడెంట్ల సమావేశంలో కింబయీవు ఇవాన్ ఇవిచ్‌ని తిడుతూ ఉపన్యాసం ఇవ్వబోతున్నాడట.

కాష్టాల్‌స్కీ—అయితే మీ రోజులు దగ్గిరపడ్డట్టే. నాలుగువేపుల నుంచీ నలుగురూ దుయ్యపట్టుకున్నారు.

బొరోడిన్—(ప్రూఫులు నేలబెట్టికొట్టి) ఆఖరుకి నన్ను వర్గశత్రువుగా తయారు చేసేరన్నమాట. నమస్కారాలు. చూసేరూ నాకేసి... వర్గశత్రుత్వానికి మూర్తిమంతాన్ని. (బోబ్రోవు, కింబయీవులు వస్తారు. బొరోడిన్ బోబ్రోవును అడ్డుపెడతాడు.) ఓహో! ప్రొఫెసర్ బోబ్రోవ్! నోరుమూసుకుంటూ. తమ ఎదట నోరు విప్పకూడదు. లేదా నిముషంలో పత్రికలకి ఎక్కిపోతుంది.

బో(బోవు—అంత భయం వద్దు. మాట్లాడు కాని, అమాట్లాడేది బాధ్యత ఎరిగి మాట్లాడు.

బొరోడిన్—ఇంట్లోవాళ్ళముందర కూడానా ?... మిత్రులముందర కూడానా?

బో(బోవు—ఆఖరుకి నువ్వు ఒక్కడివీ ఉన్నప్పుడుకూడా...

బొరోడిన్—అయితే తమరు నాయింటినుంచి ఎప్పుడుపోతారు?

బో(బోవు—ఇదిగో ఏదేనా గది చూసుకుని.

కాస్ట్రాల్‌స్కీ—(బో(బోవుతో) నన్ను దుయ్యపట్టుకోవడమే కాకుండా, ఈకిరిఘ్‌జ్‌వాణ్ణి బొరోడిన్ మీదికి ఎగతోలేవు. నీకు బయాలజీ (ప్రొఫెసర్‌షిప్ ఇచ్చినవాణ్ని అనాలి. నీవు గూఢచారిదళంలో చేర్చుకోవలసిన మనిషివి.

కింబయీవు—ఏమిటీ అబద్ధాలు. ద్రోహీ! బో(బో(వు మాలోవాడు. సరిఅయిన గురువు. ఎంతో దూరదృష్టి నేర్పుతూన్నాడు. ఈకళ్ళు వెనకటిమాదిరిగా లేవు. నిజమైనదృష్టి ఏర్పడింది. రక్తకణాలక్రనుంచి ఖగోళాలవరకూ, దేశ విదేశాలు అన్నీ (గ్రహించగలుగుతూన్నా. నేనెరిగిన (ప్రదేశం ఎక్కువౌతూంది. మాకాపక్‌స్థానం అభివృద్ధిపొందుతూంది. ఉప్పిగడ్డితో నిండిన ఆచవిటిపర్రలలో రాగిపండుతూంది. టర్క్‌సిబ్ - టర్క్‌బోన్ సైబీరియన్ రైలురోడ్డు వేయబడింది. పట్టణాలు పెరుగుతూన్నాయి. వాట్లలో అధ్యాపకులు - మంచిమంచిపుస్తకాలూ హెచ్చుతూన్నాయి. కాజక్ (ప్రజలంతా పాఠశాలలకి చేరుతూన్నారు. ఒకప్పుడు నాకు 200 మాటలకి ఎక్కువ తెలియవు. కాని, నేడు ఆసంఖ్య లెక్కపెట్టలేను. నేనూ కాజక్‌స్థానంకిపోయి, ఆపర్రలలో నిలబడి నేచదివిన పుస్తకాలన్నీ వాళ్లకి చెప్తా. నేచూసిన (ప్రపంచాన్నిగురించి బోధిస్తా. ఒకప్పుడు నేనో గొల్లవాడిని. ఆరోజులలో నాభుజాలమీదది తలకాదు కాదు డొక్కబుర్ర. కాని, ఇప్పుడు తల ఏర్పడింది. ఒక్క తలకాదు. వందలకొలదీ తలలు. (పుస్తకాలవద్దకు పరుగెత్తి, ఒకటి బయటికి తీసి) ఈతల నాతలలో కూర్చుంది. (మరొకపుస్తకం తీసి) ఇదికూడా నాతలలో కూర్చుంది. ఈతల

లన్నీ కూడా!...కాని, నువ్వు – నువ్వు నాకళ్ళల్లో ఇసకకొట్టాలని చూస్తూన్నావు. నాతల దిమ్మెక్కించేస్తూన్నావు...విధ్వంసకుడివి. నిన్ను కాల్చి పారవేస్తా.

(కింబయీవు కాస్టాల్‌స్కీ వైపు ఉరుకుతాడు. బోబ్రోవు అతడిని వెనక్కి లాగుతాడు.)

బోబ్రోవు—శాంతించు. కింబయీవ్! శాంతం!

కింబయీవు—విధ్వంసకుడు! ...విదేశాలకి జారిపోతున్నాడు. తుపాకిని వెయ్యి, కామ్రేడ్! (కింబయీవుని బోబ్రోవు బయటికి తీసుకు పోతాడు.)

కాస్టాల్‌స్కీ—పిచ్చివాడు ... గురువుగారి పాఠం వొప్పచెప్తుతూన్నాడు.

బొరోడిన్—భేష్! నాపరిశీలనలో ఈమట్టిబుర్ర ఒక కొత్తగొళ్ళెం. బాగుంది...గతవారం ఒకకుందేటికి పిచ్చిఎత్తించేను ... అంతే. ఒకపిచ్చి కుందేలు—ఒకపిచ్చివైవీజన్‌యటు! ఈరెండు పిచ్చిలకీ మూలం ఒకే విషయం...ఆశ్చర్యకరం.

(షెకోవాయ్, నటాషా, వాలంటీనాలు వస్తారు.)

నగ్గాసోవు—ఆలస్యం అయిపోయింది. పోవాలి. హెర్మన్! ఆ కాగితం జాగ్రత్త. కంటిలో పాపమాదిరిగా కాపాడాలి.

వాలంటీనా—నాన్నా! నాకొత్తమగని పలకరించు.

బొరోడిన్—ఏమిటిది? నాకు మతిపోతూంది...

వాలంటీనా—నేనాయనగదిలోనే బసచేస్తాను....నటాషా! మీ కొత్తతాతగారిని చూసేవూ?

నటాషా—నాకు తాతలెవ్వరూ లేరు. (పోయి ఒకబల్లమీద ప్రక్కగా కూర్చుంటుంది.)

వాలంటీనా—నాన్నా! పలకరించవేం. ఈయనపేరుకూడా నికోలాయ్‌యే! పేరుతబ్బిబ్బులు పడనక్కరలేదు.(బొరోడిన్ వూరుకుంటాడు.)

కాస్టాల్‌స్కీ—నూతనదంపతులకి అభినందనాలు!... వాలంటీనా ఇవానోనా! (ఆమె చేయి ముద్దుపెట్టుకుంటాడు) నాకల, నాకలచెదిరిపో యింది! నికోలాయ్‌పెట్రోవిచ్! (చేయిజాపుతాడు. షెకోవాయ్ పందే హిస్తాడు.) అభివందనాలు అందుకో, నికోలాయ్! (ఆఖరుకి షెకోవాయ్ షేక్‌హ్యాండ్ ఇస్తాడు.) మారిస్ షెవలియర్ పాటపాడతా, విటూవా!

(పియానోమీద కాస్టాల్‌స్కీ ఒక ఫ్రెంచిగీతం పాడతాడు. అంతా వింటారు పాట పూర్తి అయినాక వాలంటీనా మాట్లాడతుంది.)

వాలంటీనా—నాబట్టలు తెచ్చుకుంటూ...(వెడుతుంది.)

బొరోడిన్—(షెకోవాయ్‌వద్దకు వెళ్లి) ఏమోయ్ అల్లుడా! నా వెనకటి అల్లుడు నికోలాయ్ బోబ్రోవు నామీద కత్తిదూసేడు. నాఆత్మ బంధువు డయ్యేవు గనక, నీవు నాపక్షం వహిస్తావని విశ్వశిస్తున్నా.

షెకోవాయ్—బోబ్రోవుని ఇన్‌స్టిట్యూట్‌లోంచి గెంటేయిస్తా.

కాస్టాల్‌స్కీ—తమ పూర్వపుభార్యకూడా అటే తక్కువచేయ డంలేదు. చూడు...నీచుట్టూ వున్నవారంతా వర్గశత్రువులేనట...

షెకోవాయ్—మాకరోవాని పార్టీలోంచి తరిమివేస్తాం.

కాస్టాల్‌స్కీ—మతిభ్రష్టు కింబయీవు, బొరోడిన్‌మీద ఉపన్యా సం ఇస్తాడట.

షెకోవాయ్—కింబయీవును పిచ్చిఆసుపత్రికి పంపుతాం. దిక్కు మాలిన సందేహాలు! దిక్కుమాలిన మాలుగుబోతుతనం! ఈమూరుల్నీ, సం దేహాత్మకుల్నీ తుడిచి పారవేస్తాం. మనదేశానికి బొరోడిన్ కావాలి. ఇవాన్! ఏం ఫరవాలేదు. నీపనికానియ్యి!

కాస్టాల్‌స్కీ—త్వరలోనే గురుజీ, తమ విచారణ ఫలితాలమీద బహిరంగసభలో చెప్పబోతూన్నారు.

షెకోవాయ్—ఆ అల్లరిమూకకి చెప్పుపుచ్చుకొట్టినట్లుంటుంది. మానవ ప్రవర్తనా శాస్త్రంలో గొప్పవిప్లవం తీసుకురాగల స్థితిలోవున్నాం ఆమహా విప్లవానికి నేను కూడా నా ఉడతభక్తి చూపగలిగేనని ఆనంది స్తున్నా.

బొరోడిన్—నికోలాయ్! సరదాయైనవాడివి. నువ్వు నా అల్లుడివి అవుతావని ఎప్పుడేనా అనుకోగలిగేనూ... థ్యాంక్సు...

(వాలంటీనా వస్తుంది.)

వాలంటీనా.—మీ మాటలు అయినవా?

షెరోవాయ్—అన్ని సంగతులూ మాట్లాడుకున్నాం.

కాస్ట్రాల్ స్కీ—ఇంటివాళ్ళు నలుగురూ పిచ్చాపాటీ చెప్పుకుంటూంటే నే నెందుకు?... సెలవు!

బొరోడిన్—హెర్మన్! (ప్రక్కకి తీసుకువెళ్ళి) నన్ను సమర్థిస్తు ఆకాగితం నువ్వే వ్రాసేవు. నీ మనస్సు చాలామంచిది. కాని. ఆపని వద్దు. ఆ అభిప్రాయం నాకు నచ్చలేదు. మన పేచీలలోకి లండన్ తేవడం నా కిష్టంకాదు. ఉహూఁ.

కాస్ట్రాల్ స్కీ—చేయిదాటిపోయింది. ఇప్పుడు ఏమాత్రం సందేహించినా పీకమీదికి తెచ్చుకోడమే అవుతుంది. (వెడతాడు.)

బొరోడిన్—(కాస్ట్రాల్ స్కీని ద్వారంవరకూ పంపి) ఈ అద్భుత సంఘటన ఏలాజరిగిందో నాకేమీ తెలియడంలేదు. కాస్త చెప్పండి.

వాలంటీనా—బాగా ముసిలివాడివి అయిపోయేవు. నీకేమీ అర్థం కావడంలేదు. ఇదంతా సహజవాంఛలకి ఫలితమే ఇదంతా. నే నొక ఫ్యాక్టరీలో పనిచేస్తున్నానుకదా. నాలో నే ఒక నూతన వ్యక్తిని సృష్టించుకుంటున్నా. నాకు నేనే ఒక కొత్తమనిషినైపోతున్నా. ఇప్పుడు మారకం జనానికందరికీ ముక్కుబాగు. మొగంబాగుతో పనిలేదు. మాకు కావలసింది సాంఘిక వ్యవస్థ. అందుచేతనే నేను, కూలివాళ్ళలోంచి శాస్త్రీయకళాశాలకి వచ్చి చేరిన ఒక శ్రామికుణ్ణి ప్రేమించగలిగేను.

బొరోడిన్—హుఁ. అదా! (నటూపాతో) ఏమి చిన్ని పయొనీర్! ఈమారు ముసిలితాతమీద వ్యాసాలు వ్రాస్తావా?... నేను నీబంధువుణ్ణే కాదూ?

వాలంటీనా—నటాషా! ఆటబొమ్మలు ముడివెయ్యడం ఏమిటి? నేను నీ కొత్త అమ్మని. కాదూ?

నటాషా—ఎరిగి బ్రతుకు...

వాలంటీనా—ఒక్క చిరునవ్వు నవ్వుపోనీ. ఆ బొమ్మలతో ఆడు కుంటావా? అవన్నీ ఇంక నీవే.

నటాషా—నాకక్కరలేదు.

వాలంటీనా—నా మీద ఎందుకంత కోపం?

షెకోవాయ్—దానిని మాట్లాడించకు. పట్టి, పెంకెరాలుగాయి—మళ్ళీతల్లే.

నటాషా—నిన్ను పోలలేదు. సంతోషం. మోసగాడు!

షెకోవాయ్—(అరుస్తాడు) నోరుముయ్యి!

వాలంటీనా—నికోలాయ్! చిన్నపిల్లని అలాగ కేకలు పెడతా వేమిటి?

(బోబ్రోవు, కింబయీవులు వస్తారు. బోబ్రోవు కింబయీవుని బయటికి పంపుతూంటాడు.)

కింబయీవు—క్షమించు, కామ్రేడ్! గోలచేసినందుకు చాల విచారంగావుంది. ఛా...ఛా...నాకే సిగ్గువేస్తోంది. బొరోడిన్‌కి క్షమార్పణ చెప్పుకోవడం అవసరమంటావా? చెప్పు...

బోబ్రోవు—మరేం అవసరంలేదు. ఇంటికి వెళ్ళు ఎవరికేనావస్తుంది,

(ఇద్దరూ వెళ్ళిపోతారు)

వాలంటీనా—అతడి మొహం చూడను. నడవండి పోదాం.

(ఒక్క నటాషా మినహాగా అంతా ద్వారంవేపు నడుస్తారు.)

బొరోడిన్—నికోలాయ్! మంచి అభివృద్ధికి రాగల లక్షణాలు నీలోవున్నాయి. ఈవేళ అన్నాను. జ్ఞప్తివుంచుకో! బొరోడిన్ ఎన్నడూ పొరపాటు పడలేదు.

(వాలంటీనా, షెకోవాయ్, బొరోడిన్‌లు వెళ్ళిపోతారు. నటాషా ఒక్కర్తే వుంటుంది.)

నటాషా—ఏడుపువస్తోంది, ఇదేమిటీ?...పయొనీర్లు ఎన్నడూ ఏడవరు. ఆనందిస్తారు కాని...

(బల్లమీదనున్న తలగడాలో తలపెట్టి ఏడుస్తుంది. బోబ్రోవు వస్తాడు.)

బోబ్రోవు—నటాషా! చిట్టీ! ఒక్కర్తెవూ ఉన్నావేం?

(చెయ్యి పట్టుకుంటాడు.)

నటాషా—ఊరుకోలేను. క్లారా అత్తయ్యతో చెప్పాలనివుంది. నాన్న గోలపెడతాడని వూరుకున్నా. అందుకే వూరుకున్నా. నాగుండెలు బద్దలయిపోతున్నాయి.

బోబ్రోవు—మీ నాన్న నిన్ను కొట్టేడా?

నటాషా—లేదు. అందర్నీ మోసగించేను. మామయ్యా! ఏమిటో, ఊరికే ఏడుపొస్తోంది. తలుచుకుంటే. నాయనమ్మనిగురించి నిజంచెప్పేస్తా వింటావా? మనం ఇద్దరం స్నేహితులమే కాదూ?

బోబ్రోవు—కాకపోవడం ఏమిటి. చెప్పు, వింటా.

(అమాలియా వస్తుంది.)

అమాలియా—వాలంటినోకా! నటాషా! చిట్టితల్లీ ... పటికబెల్లం కావాలా?

నటాషా—మామయ్యా! పోదాం పదు.

బోబ్రోవు—అల్లాగే. (ఆమెను ఎత్తుకు తీసుకుపోతాడు.)

అమాలియా—నికోలాయ్‌కి పుట్టవలసిన పిల్లకాదు... (పిలుస్తుంది.) వాలంటీనా! అమ్మాయి! గుడ్డలివిగో...ఎక్కడికి వెళ్ళేవు?

(తలుపుదగ్గరికి వెళుతుంది. షెకోవాయ్ తలుపుతెరుచుకుని లోనికి వస్తాడు. అమాలియా వెనక్కి తప్పుకోబోతుంది, భయాశ్చర్యాలతో విన పడీ వినబడకుండా)

అమాలియా—నికోలాయ్!

షెకోవాయ్—నువ్వా! (తలుపు వేస్తాడు.) నువ్వు బ్రదికివున్నావా? ఇంకా నువ్వు...

అమాలియా—అదో పెద్దకథ ... పెద్దకథ ... ఎంత పెద్దవాడి వయ్యేవు!

షెకోవాయ్—నాదగ్గిరికి ఇంకా రావద్దు. కొంతకాలం. కొద్దికాలం లోనే నిన్ను 'అమ్మా' అని పిలవగలరోజువస్తుంది ఈలోగా నేను నీకొడుకునని సంగతి మరచిపో.

అమాలియా—ఆరోజు ఎన్నటికేనా వస్తుందా?

షెకోవాయ్—ఆహాఁ...ఈలేబరేటరీపని పూర్తి కానీ. ప్రొఫెసరు ఉపన్యాసం అయ్యేక అందరికీ తెలిసిపోతుంది. నామూలంగానే బొరోడిక్ శాంతంగా తనపని సాగించగలిగేడని, త్వరలోనే నెవిస్కీకి బదులు నన్నే, ఈఇన్‌స్టిట్యూట్‌కి మేనేజింగ్ డైరెక్టరుగా వేస్తారని నానమ్మకం. ఒక్కబడ్జెటుసంగతి తప్ప ఆతడికి ఏమీ తెలీదు. వైజ్ఞానికుని ఎదుర్కొగల ప్రధానసమస్యలేమిటో అతగాడికి ఏమీ తెలియవు. అందరికీ నాయందు విశ్వాసం ఏర్పడుతుంది. మంచి పేరూవుంటుంది. ఆసమయంలో కంట్రోల్ కమీషన్ ముందుకుపోయి, వాళ్ళముందు నిలిచి—'ఇదిగో, నేనో తప్పుచేసేను. పార్టీని మోసగించేను. నాకు శిక్ష వెయ్యండి' - అనేస్తా. నేను చేసిన తప్పేమిటో వాళ్ళకి తెలుస్తుంది. ఓచిరునవ్వుతో - "ఫరవాలేదులే. వెళ్ళు. ఇంకెప్పుడూ ఇల్లాంటి పని చెయ్యకు" అని చెప్తారు. నన్ను ఇన్‌స్టిట్యూట్‌కి డైరెక్టరుగా వుంచేస్తారు. అప్పుడు వద్దువుగాని.

అమాలియా—సరిగ్గా, మీతండ్రి ఈలాగే చెప్పేవారు, కభుర్లు.

(బొరోడిక్ వస్తాడు. నిశ్శబ్దం)

బొరోడిక్—నేనున్నానని భూయకోపనిలేదు. నేనేం పరాయివాణ్ని గాదు. మాట్లాడుకోండి.

షెకోవాయ్—అయితే మీకు - అన్నిసంగతులూ తెలుసునన్న మాట...

బొరోడిన్—ఆహా!

షెకోవాయ్—(అమాలియాతో) ఓహో! ఆడదానినోట నువ్వు గింజనానదు.

బొరోడిన్—నిర్మొగమాటంగా నిజంచెప్పవోయ్! నీహృదయం భయంతో కొట్టిమిట్టాడిపోతూంది. ఔనా!

షెకోవాయ్—పొరపాటు. విన్నారూ! కట్టిపొరపాటు!

బొరోడిన్—మారకంమనిషివి. వైవిజన్ యటువికావు. నువ్వొక గొప్పరాజకీయవేత్తవి ఔతావు. అది మీవంశంలోవుంది.

(వాలంటీనా వస్తుంది.)

అమాలియా—వాలంటీనా! నీకోసమే కనిపెట్టుకు కూర్చున్నా నమ్మా!

వాలంటీనా—మేమూ బయలుదేరబోతున్నాం.

బొరోడిన్—వాలూషా! సుఖించుతల్లీ!

వాలంటీనా—నమస్తే, బాబాయి!

షెకోవాయ్—సెలవు! ఇవాన్ ఇలిచ్! పొరపాటు - అన్న నా మాట మరచిపోవద్దు.

(వాలంటీనా - షెకోవాయ్‌లు వెళ్ళిపోతారు.)

అమాలియా—ఎందుకు అతడిమనస్సు కష్టపెట్టడం?

బొరోడిన్—పొరపాటుకాదు, నికోలాయ్ నిజం. సత్యం. నువ్వు భయపడ్డావు. నువ్వెంతదూరం వెళ్ళగలిగినా భయంపోలేదు. నాఅభిప్రాయాలు నిజం. ఇవాన్ బొరోడిన్ తన వుపన్యాసం ఇస్తాడు, తప్పను... మూడునెలలలోకాదు. మూడువారాలలో. అంతే. అంతే. "భావికాలము మంచు - తెరమాటు నడగినా - నానుదుటివ్రాలు నాకెరుకయే" వందల కొద్దీ జనాన్ని చూస్తున్నా. దేశం అంతటిగొప్ప అదృష్టం నాకళ్ళయెదుట కనబడుతుంది. నేనన్నిసంగతులు చెప్పేస్తా...ఈపిచ్చితనం వదల

గొడతా. ప్రజలు అన్ని సంతతులు ఎరగాలగాలి. వాల్యా వెళ్ళిపోయింది పాపం 'మాతృయాతావనచ్చేదేకుతారా:' – మహాబాగా చెప్పేడు. ముసలి తనం ఎక్కడా నిరాశ్రయమే. అమాలియా, నేనింకా దృఢంగా 'బీవర్' మాదిరిగా పనిచేస్తా. కాని, నానడుం వొంగిపోయింది. పోయేరోజులు కాని వచ్చేరోజులు కావుగదా? తెల్లవారి లేవడానికే బాధగా వుంటూంద్ది.

(జఖారోవు వస్తాడు.)

జఖారోవు—పడుచుదనంలో చురుకుదనం, ముసలితనంలో అనుభవజ్ఞానమూ వుంటూంది.

బొరోడిన్—ఇంతకాలమూ జీవించిన పద్ధతులు మంచివికావు అని గ్రహిస్తివా, ఎంత తెలివీ, ఎంత అనుభవమూ, మనశ్శాంతి కలిగించాలేవు. జఖారోవిచ్!...ముగ్గురు ముసలివాళ్ళం చేరేం ఇక్కడికి...ఇందులో ఎవ్వరి జీవితం సరియైనమార్గాన నడిచింది? ఎవరి జీవితం?

అమాలియా—ఆ తాతియానాదినోత్సవం జ్ఞాపకంవుందీ,...ఆ పందిట్లో దీపాలు...వేదికమీద, అందమయిన ఒక పడుచువాడు...

బొరోడిన్—ఆ అనాఘ్రాత కుసుమాలపరిమళములు శీతువున మంచుతడిసిన కిటికిటీలు చీకటింటును వెలిగెడి దీపశిఖలు...(పియానో మెట్లు నొక్కుతూ) ఏమయినాసరే, ఆ ఉపన్యాసం ఇచ్చితీరుతా.

(పియానో వాయిస్తూంటాడు.)

[తెర]

ఏడోరంగం.

(ఇన్‌స్టిట్యూట్‌లోని సభామందిరం బల్లవద్ద బొరోడిన్ నిలబడి వున్నాడు. అతని వెనుక బెంచీమీద నెవిస్కీ, షెకోవాయేలు, ప్రెసీడియమ్ తాలూకు అవసరసభ్యుడు కూర్చుండి వుంటారు. బొరోడిన్ సభికులకి ఉపన్యసిస్తూ వుంటాడు.)

బొరోడిన్—నా వుపన్యాసం ఆఖరు కావచ్చింది. చెవులపిల్లుల విషయంలో వాటి ప్రవర్తనని నడిపించే శక్తులు మీరు చూసేరు ఆశక్తిని

మనం కనిపెట్టగలిగినప్పుడు దానిని మార్చి మరొక శక్తిద్వారా వాటి ప్రవర్తనని మార్చగలిగేం. అంటే, సాంఘిక పరిసరాలని నడిపించి శక్తుల్ని మనం కనుక్కోగలిగేం తద్వారా, ప్రవర్తన ముందుముందు ఏవిధంగా మారబోతూందో కనిపెట్టగలిగేము. కొద్దిరోజులలోనే రాజకీయాల ప్రాముఖ్యతని విజ్ఞానశాస్త్రాలు ఆక్రమిస్తాయి. మనదేశాన్ని మన శక్తికొలదీ అభివృద్ధిలోకి తేవడానికి స్థిరపడచుకున్నాం. దానికోసమే ఈనాటి మానవుని ప్రవర్తనని నియమిస్తూన్న మూలశక్తు లేమిటో విమర్శింప పూనుకున్నాము. ఈపనిలో కమ్యూనిస్టుపార్టీసభ్యులుకూడా తోడ్పడ్డారు. వారిలో నికోలాయ్ పెట్రోవిచ్ పేరు ముఖ్యంగా జ్ఞాపకం చేసి తీరవలసిందే — వారిసహాయంతో — అనేక సాంఘికవ్యవస్థలకి సంబంధించిన వ్యక్తుల్ని జాగ్రత్తగా పరీక్షించేము. మేము పరీక్షించిన పద్ధతులూ — ఆ నిర్ణయాలూ ఇక్కడ చెప్పదలచుకోలేను. వివరాలు తెలుసుకోదలచినవారు తీరుబడిగా, ఆఫీసు రికార్డు చదువుకోనచ్చు. కాని, ఇక్కడ ఒక్క విషయం చెప్పవలసివుంది ప్రజలలో నూటికి 80 వంతుల మందియొక్క ప్రవర్తనకి మూలం—భయం!

ప్రజలలోంచి ఒకధ్వని—ఏమిటది.

బొరోడిన్—భయం!

(ఇప్పుడు మొదలుకొని, ఉపన్యాసం ముగిసేవరకూ, సభామందిరం నాలుగుమూలలనుంచీ ప్రశ్నలు వేస్తూ, కాగితములు, అధ్యక్షుని ముందుకి పంపబడతాయి.)

బొరోడిన్—ఒక పెద్ద ధ్వనిమూలంగానో, వెనక ఆసరాలేకపోవడం మూలంగానో కలిగిన భయమే మానవుని ప్రవర్తనని నియమిస్తుందని థారన్ డైక్, వాట్సన్, లాష్లీలు నిరూపించేరు. మేము పరీక్షించినవారిలో నూటికి 80 మంది, ఇతరుల నోటికి భయపడో, సాంఘికపతనానికి భయపడో బ్రతుకుతున్నారు. పాలమ్ముకునేదానికి తన ఆవుని లాక్కుంటారేమోనని భయం. రైతుకి సమిష్టివ్యవసాయానికి నిర్బంధిస్తారని భయం. హద్దూ - పద్దూలేని వడపోతలకి (Purge) సోవియటువర్కర్ భయ

పడుతున్నాడు. పార్టీవర్కరు, మార్గం తప్పేడంటారని భయపడతాడు. వైజ్ఞానికుడు, తనని ఆధ్యాత్మికపు పిచ్చి పట్టుకుందంటారేమోనని భయపడుతూన్నాడు. మనం నేడు ఒక పెద్ద భయపూరితమైన వాతావరణంలో మెలుగుతున్నాం. అద్భుత ప్రజ్ఞాల మేధావులుకూడా, భయంకొద్దీ తల్లిపేరు చెప్పుకోడంలేదు. ఉన్నతస్థానాలకి రావడానికి వీలుండదని తమవర్గమూలం కప్పిపెట్టుకోవలసివస్తోంది. ఉన్నత పదవులలోకి వచ్చేక, బయటపడితే నష్టం వస్తుందనేభయం అంతగాలేదు కాని, ప్రతివాడూ భయపడుతూనే వున్నాడు. ప్రతివాడూ ప్రతివానినీ అనుమానిస్తున్నాడు. ఏకాకిగావుండ కోరుకుంటున్నాడు. మర్యాదని విసుస్తున్నాడు. ఒక జీవిత సిద్ధాంతం అంటూ లేకుండా బ్రతుకుతూన్నాడు. భయంకొద్దీ పనిలో ప్రాల్మాలిక పెచ్చుతూంది రైళ్ళ రాకపోకలలో ఆలస్యానికి అదేకారణం. పరిశ్రమల విధ్వంసనానికదేకారణం. ఈ దరిద్రం - ఈ ఆకలిబాధ దానివలననే, చీవాట్లకి భయపడి, బ్లాక్ బోర్డ్ మీద పేరు ఎక్కిస్తారని భయపడి, నిర్బంధిస్తారనో, ప్రవాస-పంపుతారనో భయపడి, ఎవ్వరూ ఏపనికీ స్వతంత్రం చెయ్యలేకుండావున్నారు. కొండచిలవని చూసి కుందేలు ఏమవుతుంది. ఒక్క అడుగు కదలలేదు. దానినరాలన్నీ బిగిసిపోతాయి. ఆపాము తన చుట్టలమధ్య నలిపి చంపేసేదాకా అది కళ్ళు వప్పగించి ఆలాచూస్తూ నిలబడుతుంది. ఇప్పుడు మన అవస్థ సరిగ్గా కుందేళ్ళనాదిరిగానేవుంది...కనక ఈ పరిస్థితులలో మనం నిర్మాణం సాగించగలమా? సాగించలేము!

మేము పరీక్షించిన మిగిలిన 20 మందీ వైవీజన్ట్సీలు వాళ్ళకి భయపడవలసిన పనిలేదు. దేశానికి అధికారులు వారే. వారు వైజ్ఞానిక కళాశాలలలోకి గంభీరంగా, టకటక బూట్లు చప్పుడుచేసుకుంటూ, వెడనవ్వులు నవ్వుతూ, తెగవాగుతూవస్తారు. కాని వారి మెదడులు వారికే భయపడుతూన్నాయి. శారీరకపరిశ్రమలకి అలవాటుపడిన వారి మెదడులు. ఈఅధిక పరిశ్రమకి బెదిరిపోయి తమరిని విజ్ఞానంనుంచి తరిమివేస్తున్నట్లు భ్రమపడుతూన్నాయి. ఇతరులని కలుసుకోనడం. ఇతరుల్ని దిగతొక్కడం ఇదే

వారి నిరంతరాలోచన. ఈపందెంలో వారికి పిచ్చెనా ఎత్తిపోతూంది. లేదా మెదడు స్తంభించియేనాపోతూంది. భయం పోగొట్టండి – భయకారణాలన్నీ నిర్మూలించండి – మనదేశం ఎంతముందుకువస్తోందో చూసుకోండి. మీరంతా సెలవిస్తే నా ఉపన్యాసం ఇంతతో ముగిస్తా. (బల్లదగ్గరనుంచి వెనక్కి వెళ్ళిపోతాడు.)

షెకోవాయ్—కత్తి లేకుండా గొంతుకొయ్యడం అంటే ఇదే. (నుదుటిచెమట తుడుచుకుంటాడు.)

నెవిస్కీ—(బల్లవద్దకు వచ్చి) ప్రొఫెసర్ బొరోడిన్ ఉపన్యాసాన్ని విమర్శించడానికి ఇంచుమించు నూరుగురు కామ్రేడ్స్ తమపేరులు పంపేరు. ఇంక కాగితాలు పంపవద్దని ప్రార్థన. మొట్టమొదట కామ్రేడ్ స్పాసోవా మాట్లాడుతుంది. ఈవిడ 'రెడ్ రోలింగ్ మిల్లు' లో పనిచేస్తోంది. అటుతరువాత ప్రొఫెసర్ బోబ్రోవు మాట్లాడుతాడు. (కూర్చుంటాడు.)

క్లారా—(లేస్తుంది) ఈఇన్స్టిట్యూట్ ని పోషించే బాధ్యత తీసుకోదలచిన ఫ్యాక్టరీకి నేను ప్రతినిధిని. కాని, అటువంటి స్వల్పవిషయాన్ని గురించి ఇన్స్టిట్యూట్ వారు శ్రమపడదలచలేదు.

నెవిస్కీ—ఇప్పుడు మనం ఈవైజ్ఞానికోపన్యాసం విషయం మాట్లాడుతున్నాం. పోషకత్వంసంగతి ఇక్కడ అప్రస్తుతం.

క్లారా—మాఫ్యాక్టరీ పోషకత్వమే వహించివుంటే ఈమాదిరి ఉపన్యాసం ఇవ్వనిచ్చివుండదు.

ఒకగొంతుక—నిజం!

క్లారా—మనం ఒకభయభ్రాంతయుగంలో జీవితం గడుపుతున్నాం. మీరు, నేనూ ప్రొఫెసరూకూడా భయం అనేది ఈనాటిదికాదనీ, వేలూ–లక్షలూ కొలదిసంవత్సరాలనుంచి మనుష్యుని అనుభవంలోవుందనీ ఎరుగుదురు. ప్రపంచంలో బానిసత్వమూ – పీడన అనేవి ఎప్పుడు పుట్టేయో, ఆనాటినుంచీ ఒకమనిషిని మరొకడు అడిచిపెట్టడానికి భయంఅనేది గొప్ప

ఆయుధంగా వినియోగపడుతోంది. భయపెట్టడం_వారి అభిప్రాయాల్ని అణిచిపెట్టడం _ పీడితప్రజల ఎదురొక్కలును నాశనం చేయడం _ ఇవే వారిని చెప్పినట్లల్లా వినే కుందేళ్ళ మాదిరిగా చేయడానికై, ఎల్లకాలాల లోనూ, ఎల్లదేశాలలోనూ కొందచిలవలు ఉపయోగించిన పద్ధతులు భయ పెటడంకోసమే! అందుకే బొలోటిన్ గొంతులో కాచిన సీసం పోసేరు. సెర్ కారాఝిన్‌సు చక్రాలక్రింద నలగకొట్టబడ్డారు. అందుకే పుగాచేవు తల నరికివెయ్యబడింది. దాసులుండే గ్రామాలకి గ్రామాలు పూర్తిగా నాశ నం చెయ్యబడినదందుకే. మాస్కో_జిల్లాలోని శ్రామికవర్గపు అగ్రిగామి దళం ఉరితియ్యబడింది. సైబీరియాలోని పార్టి జాన్‌దళాలపొట్టలు చీరింది అందుకే. జారిస్టుప్రభుత్వాన్ని ఎదురుక్కుంటే పుట్టగతులుండవని మతబోధ కులు బెదిరించేరు. శారీరక పరిశ్రమ చేసేవాడు వైజ్ఞానికుడు కాలేడని ప్రభుత్వం నిర్వహించలేరనీ, ప్రొఫెసర్లు దబాయించేరు. వారు మనల్ని బెదిరించడానికే ప్రయత్నించేరు. కాని, ప్రొఫెసర్ బొరోడిన్! ఈపీడిత ప్రజ పట్టి కుందేళ్ళరకంకాదుసుమా! వీళ్ళే స్పార్టాకస్ సైన్యాలలో పనిచేసేరు. ఇంక్విజిషన్ కాస్టాలలోంచి స్వాతంత్ర్యగీతాలు పాడింది వీరే. తమర్ని బాధిస్తున్నవారి మొగాల ఉమ్మివేసేరు. ఉరిపీఠంమీదినుంచి పో రాటం నడపించడానికి ఉపదేశాలు ఇచ్చేరు. వేలకొలదీ మైళ్ళు కాలినడ కని స్రెడ్నోకోలింస్కుకంటూ కఠినశిక్ష విధించి తరిమేసు. స్రెడ్నోకో లింస్కు చేరేటందుకు ఎంతకాలంపట్టిందో ఎరుగుదువా? ఎనిమిదేళ్లు! యాకుట్‌స్కుకి రెండున్నరఏళ్ళు పడుతుంది వెళ్ళడానికి. మీరు పరీ క్షించిన పాలు అమ్ముకొనే మనిషి వ్యవహారంవంటిదికాదు అది. వాళ్ళకి విధించినది కఠినశిక్ష _ జైలు _ అయినాసరే, వారు పోరాటం సాగించ డానికి పారిపోతూనే వుండేవారు తెలిసిందీ _ ఆవిధంగా భయం నిర్భయ త్వానికి దారితీసింది. పోగొట్టుకుందుకు ఏమీలేని వారి నిర్భయత్వానికి _ శ్రామికుల _ విప్లవకారుల _ బోల్షివిక్కుల నిర్భీకత్వానికి దారియిచ్చింది. అటువంటి మమ్మల్నా రెళ్ళు ఆలస్యం అవుతూన్నాయని బెదిరించడం?

అల్లాసార్లాపడదు. ప్రొఫెసర్! ఉన్నతాధికారాలలో వున్నవారికి బయట పడతామనే భయంతక్కువ అన్నావు. కాని, మాపార్టీ ఎంతెంత పెద్ద వుద్యోగుల్ని బయటపెట్టిందో నీకు తెలుసా? ఈవేళ ఒకమనిషి గొప్ప వాడుకావచ్చు. రేపే అతడు ఎందుకూ కొరగానివాడుగా చెయ్యబడ తాడు, తనని అభివృద్ధిలోకి తెచ్చిన శ్రామికవర్గానికి ద్రోహం తలపెడితే ప్రొఫెసర్! నువ్వు గొప్పవాడివే. అయినా నీతప్పులు బయటపెట్టడంలో ఏవిధమయిన కనికరం చూపబడదు. కారణం ఏమిటో ఎరుగుదువా? నువ్వు సోవియట్ శత్రువుని కాదు సమర్థిస్తూంట. పూర్వకాలపు అధికారవర్గాన్ని సమర్థిస్తున్నావు. పార్టీసభ్యుణ్ణికాదు సమర్థిస్తుంట - పార్టీలో దొంగతనంగా దూరినవాణ్ణి. శ్రామికుణ్ణికాదు - విధ్వంసకుడిని సమర్థించుతూన్నావు. రైతునికాదు కులక్‌ని హెచ్చరించుతూన్నావు. ఈభయం మానవుని దిగపీకుతూంది. కాని, అందర్నీ కాదు. మమ్మల్ని మోసగించేవారిని - మరల పూర్వపుపద్ధతులకోసం ఎదురుచూస్తున్నవారిని దిగపీకుతూంది. అల్పులయినవారిని భయం ఏడిపిస్తోంది. శ్రామికవర్గ నియంతృత్వానికి భయపడేది నువ్వు. గుడ్డలు తిండీకూడా లేని, రెడార్మీ, కాలిజోళ్ళయినా లేకుండా, 'పెరికోప్' నగరం స్వాధీనం చేసుకున్నప్పుడు వారిని దిగపీకిన భయం ఏమిటయ్యా! ఆభయం ఏదంటా? ప్రొఫెసర్! ఈసంగతులు మరిచిపోకు. భవిష్యత్తులో వీటినికూడా మనసులోవుంచుకుని పనిచెయ్యి. వర్గపోరాటంలో మేము భయం ఎరగం. వర్గశత్రువు విషయంలో దయవుంచం. (ఆగుతుంది.) 1907 లో వాళ్ళు నాకొడుకుని వురితీసేరు. ఇరవైయేళ్ళు పోయేక 'విప్లవవస్తుప్రదర్శనశాల'లో వధకుడికిచ్చిన బిల్లు కనపడింది. అది మొదలుకొనీ, ముసిలితనంవలన కాస్త బద్ధకం తోచినప్పుడల్లా, ఆబిల్లు చదువుకుని ఉత్సాహం తెచ్చుకుంటూవున్నాను, ఇదిగో ఆబిల్లు; 'ఉచ్చు - ముప్ఫైకోపెక్కులు; తాడు - అరరూబులు; నెత్తిపైపెట్టినసంచికి - ఒక రూబులు" మొగం కనిపించకుండా వుండేటందుకు తలకి సంచీకట్టేరు. తమరు ఉరితీసినవాడి మొగంచూడడానికే వాళ్ళు భయపడ్డారు. తమరు

విధించిన శిక్ష చూడడానికి వాళ్ళకే భయం. వీలుచిక్కితే మన అందరి తలలనీ తలోసంచీ తగిలించాలనే వారి ఆశ. ఆ త్రాడుకి అరరూబులు కాదు. లక్షరూబుళ్ళయినా సంతోషంతో చెల్లిస్తారు. కాని, ప్రపంచం ఎన్నడూ కనివిని యెరగనట్టి, రక్తప్రవాహాలలో తేల్చి, భయంలో అణిచిపెట్టే ఆవురితాళ్ళు మీ చేతుల కిస్తాం అనుకోకండి. ఓ పెట్టుబడిదారీ పెద్దమనుష్యులారా! ఈమారు మనం ఆఖరుమారుగా ఎదుటపడినప్పుడు మీ నెత్తిన సంచులు కప్పం. (ఆగుతుంది.) ఈభూమిమీద ఆపీడకుల ఒత్తిడిని సంపూర్ణంగా నాశనంచేసివేసేక, తరువాత మనసంతానం 'భయం' అనే శబ్దానికి అర్థం శబ్దకోశాలు తిరగవేసి తెలుసుకోవలసివస్తుంది. కాని, అంతవరకూ వర్గపోరాటంయొక్క నిర్భీకత్వంలో అనుభవం సంపాదించుకోండి. శత్రువుయొక్క కొత్త పోకడలు తెలుసుకోనండి. శ్రామికవర్గముయొక్క సంపూర్ణ బలయుతములయిన భుజాలతో వారిని అదరకొట్టండి!

[తెర]



# నాలుగో అంకం

---

ఎనిదో రంగం.

[ఓ.గ్పూ.శాఖ హెడ్ క్వార్టర్సులో పరిశోధకుని ఆఫీసుగది. పెద్ద - ఎత్తయినగది. అతలుపులే నిశ్శబ్దతని సంరక్షిస్తున్నాయా అనిపిస్తుంటాయి. తెరుచుకున్నప్పుడుకూడా ఏమీ ధ్వనికలగదు. ఒక న్యూస్ పేపర్లకట్ట చేతిలో పట్టుకొని బొరోడిన్ ప్రవేశిస్తాడు. తలుపు మరల మూతబడిపోతుంది. పరిశోధకురాలు కూర్చుని వ్రాసుకుంటూన్న బల్లదగ్గరకి ఆతడు వెడతాడు. ఆమె చాలా నెమ్మదియైనదీ - ఖచ్చితమైనదీను.]

బొరోడిన్—నన్ను అరెస్టు చేస్తారని నాకు తెలుసు. దయవుంచి మాయింటికి టెలిఫోనుచేసి, పడకగది స్లిప్పర్లువచ్చేలాచేసి పెడతారా? (పరిశోధకురాలు బొరోడిన్‌ను కూర్చోమని సంజ్ఞచేస్తుంది. మరల తనపని చూసుకుంటుంది.) చాలామంచిదానివి. (కూర్చుని, న్యూస్ పేపర్లు వొడిలో పెట్టుకుంటాడు.) అయితే...విజ్ఞానం అంటే నీకు భయం...నన్ను అరెస్టు చేసి శాస్త్రీయపరిశోధనలు అణచి పెట్టాలనుకుంటున్నావు. కాని వాటిని నీ చేతిలోవున్న అధికారంద్వారా అణిచివెయ్యగలుగుతూన్నావే గాని, వాటిని తిరస్కరించగల కారణాలు చూపి కాదుసుమా!...జైలులో పెడతానని నన్ను బెదరించలేవు...నారోజులు అయిపోయేయి.మంచంమరణమా-జైలుమరణమా అనే విషయం అంత ముఖ్యమైనదికాదు, నాకీవయస్సులో... కాని, నా అభిప్రాయాలు చచ్చిపోవు. నా శిష్యులు వాటిని ఇంకా అభివృద్ధిలోకి తెస్తారు. .ఆ బోల్షివిక్ ముసిలిది మంచిసమాధానమే ఇచ్చింది... గంభీరంగా చెప్పింది...ఆలోచనతో చెప్పింది. ఆమె చెప్పిన విషయాలు కొన్ని ఆలోచించ తగినవే. ఆలోచిస్తున్నాకూడా. ఆ వుపన్యాసం విన్నాక తెల్లవార్లూ నిద్రపోలేదు. ఆముసిలిదానిని గురించే ఆలోచించేను. ఆ మెదీ

నాదీ ఒకే వయస్సు. కాని, మామనిషితనాలుమాత్రం వేరుగా నడుస్తున్నాయి. పూర్తిగా వేరు. ప్రపంచం విషయంలో మా ఇద్దరి దృక్పథాలూ వేరు. ఆవిడకి ఓజాబు వ్రాయడానికి ఆరంభించేనుకూడా. కాని, పూర్తి చెయ్యలేకపోయేను. రాసినంతవరకు ఏమీ తప్పులేదు...ముప్ఫయిఏళ్ళ క్రితం అంతా కళ్ళకి కట్టినట్లు కనపడేది...ఈ న్యూస్ పేపర్లు తెచ్చేను... వాటిలో నా మీద తెగ వ్రాసేరు...(ఊరుకుంటాడు.) కానీ, నీ పరిశోధన పూర్తిచెయ్యి. (పరిశోధకురాలులేచి ఏవోకొన్ని కాగితాలు తీసుకుని బయటికివెళ్ళిపోతుంది. బొరోడిన్ ఒక్కడే గదిలోవుంటాడు.)ఉహూం... (ఒక్కనిముషం వూరుకుని పేపరు విప్పుతాడు.) "ప్రొఫెసర్ హోదాలో వర్గశత్రువు"—ఇదంతా నన్ను గురించే ఓ...(చదువుతాడు.) ఇదంతా తమ వాదనని దృఢపరచుకోవడమే. (మరో పత్రికతీసుకుంటాడు.) "బొరోడిన్ సిద్ధాంతాలు బయట పెట్టాలి"...వ్యాసాలు, లేఖలు, తీర్మానాలు... ప్రొఫెసర్లు విద్యార్థులు, లోహపుపనివాళ్ళు, వస్త్రపారిశ్రామికులు... అందరికీ ఒకే కారణంవలన కోపం. (మరోపత్రిక తీస్తాడు.)" శ్రామికులు విజ్ఞానరంగంలోకి రావడంతోనే ఆఖరుమాయ ధైర్యం చేస్తున్నారు."

(భయంతో జఖారోవు నెమ్మదిగా పిల్లిలా ప్రవేశిస్తాడు.)

జఖారోవు—ఇవాన్ ఇలిచ్...

బొరోడిన్—(న్యూస్ పేపరులో ఒక కాలం చూపుతూ) విసారియన్, ఇల్లా చూడు! వెనక నావద్ద పనిచేసిన 'నాస్త్యా' అనే దాసీమనిషి ఫోటో. ఆమె ఇప్పుడు వస్త్రపరిశ్రమలో పనిచేస్తోంది. మంచి పేరు సంపాదించింది. ఆమె బొమ్మక్రింద ఒక చిన్న వ్యాసం...నాస్త్యా నా మీద చిన్న వ్యాసం వ్రాసింది. నాస్త్యావ్రాయడం, విన్నావూ? మొన్న మొన్నటివరకూ ఆమెకి అక్షరాలురావు. ఆహా! ప్రజలలో ఎంతమార్పు వచ్చింది?

జఖారోవు-- నాస్త్యామాట అల్లావుంచు. ఇప్పుడు నాప్రాణాల మీదికే వచ్చింది.

బొరోడిన్—ఓహో. సరే. సరే. (నాలుగుమూలలూ చూచి) ఇక్కడికి ఎందుకు వచ్చేవు?

జఖారోవు—ఆ పరమేశ్వరుడికే ఎరుక. ఎవ్వరికీ ఇబ్బంది కలిగించకుండా... నాపని నేను శాంతంగా చేసుకుంటూన్నా... చాలా ఆశ్చర్యంగా వుంది...

బొరోడిన్—విచారించకు. ఫరవాలేదు. శ్రీకృష్ణభగవానుణ్ణి ప్రార్థించు. విషయవాంఛ విడిచిపెట్టు; మానవబంధాలు తెంపుకో.

జఖారోవు—కానీ, ఆపని నువ్వే చేయి.

(పరిశోధకురాలు కింబయీవుని వెంటబెట్టుకుని వస్తుంది. కింబయీవు ఆమెతో మాట్లాడుతూంటాడు.)

కింబయీవు—కామ్రేడ్, జఖారోవ్ ఇన్‌స్టిట్యూట్ కోసం కొంటూన్న పుస్తకాలు చూసేవూ? శరీరశాస్త్రజ్ఞుల ఉపయోగంకోసం Cross and the Pentagrams A Medium's hand book, Mysticism as the basis of the world ఇవా కొనవలసిన పుస్తకాలు? ఇంకా వున్నాయి ఒక పెద్దబండెడు. విధ్వంసనం! ఏమంటావు ఈపనికి? కామ్రేడ్!

పరిశోధకురాలు—దీనికేమంటావు ఇవాన్!

జఖారోవు—మానవప్రవర్తనా శాస్త్రాలలో (Occultism) చాలావుత్తమం. మేము మానవప్రవర్తననిగురించి విచారణ చేస్తూన్నాం గనక...

బొరోడిన్—విసారియన్! ఒకప్పుడు నువ్వూ ప్రొఫెసరువే కాదూ?...

కింబయీవు—(పరిశోధకురాలితో) వెల్. కామ్రేడ్! సెలవు. ఈవ్యవహారం నీకు వదిలిపెడుతూన్నా. ఇంకా చాలా ముఖ్యమైన విషయాలు చూసుకోవాలి. ఇన్‌స్టిట్యూట్‌కి పోతూన్నా.

(వెడతాడు.)

జఖారోవు—అయితే ఇదంతా పుస్తకాలకోసమేనా?... పనికిరానివి కొన్నందుకా? చాలాబాగుంది. ఇంతేనా? మరేమన్నావుందా? నేను పోవచ్చునా?

పరిశోధకురాలు—మరేమీ లేదూ?

జఖారోవు—ఏముంది? నా ప్రమాణపూర్తిగా చెప్తూన్నా. ఏమీ లేదు. (ఆగుతాడు) ఏమీ లేదు. నాగరిక ప్రపంచానికి వ్రాసిన విజ్ఞప్తి మీద సంతకం చేసేను... కాని నాతోడు ... ఒక్క కానీ కూడా ఇంతవరకు ముట్ట లేదు. దానిమీద సంతకం పెడితే నెలకి నూరు రూబుళ్ళు ఇస్తామన్నారు. కాని ఒక్క కానీ కూడా ఇంతవరకు ఇయ్యలేదు.

పరిశోధకురాలు—ఎవరిస్తామన్నారు?

జఖారోవు—(కంగారుపడి) ఎవరా? (బొరోడిన్‌ను చూపుతూ) అతడు.

బొరోడిన్—(ఆశ్చర్యంతో) నేనా?

జఖారోవు—(బొరోడిన్‌ని చూపుతూ) అతడే చేసేడు. ఆడబ్బుతో ఒక టెలిస్కోపు కొని, ప్రజలకి నక్షత్రాల్ని గురించి చూపుదామని తలచేను.

పరిశోధకురాలు—అది ఎవరు వ్రాసేరు?

జఖారోవు—(బొరోడిన్‌ను ఉద్దేశించి) అతడే.

పరిశోధకురాలు—(చదువుతుంది.) 'ప్రొఫెసర్ బొరోడిన్ అరెస్టు చేయబడ్డాడు.' కాని ఈమాట అబద్ధం కాదు. ఇవాళ?

బొరోడిన్—వద్దుసుమా అంటే విన్నాడు కాదు.

పరిశోధకురాలు—ఎవరితో అన్నావు?

బొరోడిన్—ఎవరితోనా? ఎవ్వరితోటీ కాదు. ఆవిజ్ఞప్తి నేను వ్రాయలేదు.

పరిశోధకురాలు—అయితే ఎవరు వ్రాసేరు?

బొరోడిన్—నాకు తెలియదు...

జఖారోవు—వ్రాసింది... అతడే... అతడే...

పరిశోధకురాలు—నువ్వు వెళ్ళవచ్చు. (జఖారోవు వెనక నడకతో తూలితూలిపోతూ వెడతాడు. పరిశోధకురాలు ఒకమాటు నొక్కుతుంది. వర్ధానోవు ప్రవేశిస్తాడు.) బొరోడిన్‌ను గురించి నీకు ఎంతవరకు తెలుసు.

వర్గాసోవు— నేనేపని చేసినా ఆతని ఆజ్ఞప్రకారమే. విజ్ఞప్తి మీది సంతకాలు ఆతని సలహాతోనే పెట్టించేను. దానిని విదేశాలకి పంపమని నాతో చెప్పేడు. మన సైంటిఫిక్ పార్టీ యొక్క కార్యక్రమాలలో ఇదొకటి అన్నాడు. ఆ కార్యక్రమాలు ఏమిటో, దానిలో ఎవరెవరు, ఎందుకు పాల్గొంటున్నారో నేనెరగను ఈరహస్యాలు నేనెన్నడూ తెలుసుకో దలచలేదు.

పరిశోధకురాలు— నువ్వు వెళ్ళవచ్చు.

వర్గాసోవు— ఇంకొంచెం చెప్పాలి. కుందేలును అణిచిపెట్టినట్లే నన్ను ఈ ప్రొఫెసరు ఒక పెద్దభయం పెట్టి అణిచివుంచేడు. ఆ భయంచేతనే నేను నోరుఎత్తలేదు...

పరిశోధకురాలు— వెళ్ళవచ్చు?

(వర్గాసోవు వెడతాడు.)

బోరోడిన్— అయితే నావుపన్యాసాన్ని గురించి చర్చ చెయ్యబోవడం లేదన్నమాట?

పరిశోధకురాలు— ఇది చదువు తెలుస్తుంది. (ఒక కాగితం ఇస్తుంది. బోరోడిన్ చదువుతుంటాడు.)

బోరోడిన్— నేనెవ్వరికి శిక్షపెట్టలేదు... సైబీరియన్ టీస్సెలమీద కయ్యానికి నేను లేబరేటరీ తెరవలేదు... నేనేవీ పుస్తకాలూ వ్రాయలేదు... సైంటిఫిక్ పార్టీ ఏమిటోకూడా నేనెరగను...(పరిశోధకురాలు మరల మీటునొక్కుతుంది. కాస్టాల్స్కీ వస్తాడు.) హెర్మన్! అన్ని సంగతులూ చెప్పేశాయనా? అన్నీ!...ఇతడు నా శిష్యుడు. నాకు సాక్షి! ఆవుపన్యాసం మేమిద్దరమూ కలిసి తయారుచేసేం. ఆతడన్నీ ఎరుగును. హెర్మన్! అన్ని సంగతులూ చెప్పు.

కాస్టాల్స్కీ— నేచెప్పినది మళ్ళీ ఇంకోమారు చెప్పాలా? (పరిశోధకురాలు తలవూపుతుంది.) సరే అయితే చెప్తా. నేను సరిహద్దులలో

అరెస్టుచేయబడి తీసుకురాబడ్డాను. నామీద ఎన్నో నేరాలు మోపబడ్డాయి. కాని, వానిని చేసింది ప్రొఫెసర్ బొరోడిన్ కాని, నేను కాను.

బొరోడిన్.—నేనా?

కాస్టాల్‌స్కీ—ప్రొఫెసర్ బొరోడిన్ నాగురువు. శిక్షకుడు. ఆయనసిద్ధాంతాలయందు నాకు నమ్మకం కుదిరింది. ఆయన నిర్ణయాలఎడ నాకు విశ్వాసంవుంది. తనయొక్క పట్టుదల - కార్యదీక్ష - అధికారం - సామర్థ్యముతో నన్ను లోబరచుకున్నాడు. వైవీజక్‌ట్సీలయెడ అసహ్యాన్ని ప్రొఫెసర్ బొరోడిన్ నాలో కలుగచేసేడు. విజ్ఞానశాస్త్రాలద్వారా వారితో పోరాడాలని చెప్పేడు. 'ఇదివరకటికన్న రెట్టింపుశ్రద్ధతో చదువు. ఈవైవీజన్‌ట్సీలు నిన్ను అందుకోగలగకూడదు. రాజ్యాంగంమీద అధికారంవహించవలసినది వారుకాదు - మనమేననేసంగతి స్పష్టపరచు" అని హెచ్చరించేడు. భయం - ఆకలి - పిచ్చి నాకు కనబరచేడు అన్నిచోట్లా. 'కుక్కలపోట్లాటకీ - శ్రామికుల విప్లవానికీ తేడాలేద'ని చెప్పేడు. 'రెండువిషయాలలోనూ మూలకారణం ఆకలే. కుక్కలు ఎంగిలివిస్తరికోసం పోరాడుకుంటాయి. శ్రామికులు అన్నంకోసం పోరాడుకుంటారు. వర్గకలహం అన్నది పనీపాటాలేని రాజనీతివేత్తలసృష్టి' అని చెప్పేడు. బొరోడిన్ స్వయంగా గొప్పరాజనీతిజ్ఞుడు. బోధిస్తాడు - రెచ్చగొడతాడు - తాను స్వయంగా ప్రక్క-ప్రక్కలనుంటాడు, పేచీకి దూరంగా. ఇంక నేను వట్టిఉద్రేకంతో - పడుచువాడినికదూ? - నాశనం చేయబడిన న్యాయాన్ని నిలబెట్టడానికి నడుము కట్టేను. విప్లవవిద్రోహుల రాజకీయోద్యమానికి 'భయ' సిద్ధాంతం ఒకజెండా అని నాకు తెలుసు.

బొరోడిన్—దారుణం!

కాస్టాల్‌స్కీ—ఔను. దారుణమే! బొరోడిన్ నిజాయితీగా విజ్ఞానరంగంలో పనిచేసేడు. ఇంక నేను నానా ఊడిగచాకిరీ చేసేను. కుట్రలలో తలదూర్చేను. అజ్ఞానం - అసహ్యంలో పీకలవరకూ దిగబడిపోయేను. ఎందుకు? ప్రొఫెసరు శాంతంగా తన వైజ్ఞానికోపన్యాసం పూర్తిచేసుకుం

దుకు. కాని, నేనిప్పు డాతనిమీద ఫిర్యాదుచేస్తూన్నా. నన్ను విచారించిన దానికి పదింతలు కఠినంగా ఆతనిని విచారించండి.

పరిశోధకురాలు—నువ్వు వెళ్ళవచ్చు.

కాస్టాల్‌స్కీ—ఇవాన్! నన్నుకూడా ఎందుకు దూర్చేవు?

(వెడతాడు.)

పరిశోధకురాలు—(వెనక్కీ - ముందుకీ పచారుచేస్తూ, తనచేతిలో నున్న ఒకస్టెనోగ్రాఫిక్ రిపోర్టుని చదువుతూంటుంది.)

"ఇప్పుడు మన అవస్థ సరిగ్గా కుందేళ్ళమాదిరిగానే వుంది. కనక ఈపరిస్థితులలో మనంనిర్మాణం సాగించగలమా? సాగించలేము"...అయితే ఈమానవులమాట ఏమిటంటావ్, ఇవాన్? వీళ్ళు కుందేళ్ళంటావా? కొండచిలువలంటావా? వాళ్ళు నిన్ను ఏవిధంగా చుట్టపెట్టి నొక్కివేసేరో గమనించేవా? ఇదంతా ప్రాణభయంచేతనే అంటావా? విప్లవనిరోధకులతో చేరినప్పుడే వారిభయం వొదిలిపోయింది...ఇవాన్! వర్గపోరాటం వుండే, అది సకలభయాలనీ నాశనంచేస్తుంది. సరే...వారి నేరారోపణ లన్నింటికీ నువ్వేమి సమాధానం ఇస్తావు?

బొరోడిన్—నేను చెప్పగలది ఏమీలేదు. అంతే...అంతా అబద్ధం...దారుణం!

[తెర]

## తొమ్మిదో రంగం.

(ఉదయంపూట, ఎలెనా యింటివద్ద గది అంతా చిందరవందరగా వుంది. నిర్మానుష్యంగా కనబడుతూంది. ఎలెనా బల్లమీద పాత్రిలు పళ్ళేలూవుంటాయి. ఒకమూల ఒక పెద్దట్రంకు, 'అమాలియా సామానుతో, వుంది. ఇప్పుడు అన్నిమూలలా పెట్టెలు, సీసాలు, తుక్కు, మాగర నిండి వుంది. కర్రసామానంతా అటూ, ఇటూ అడ్డదిడ్డంగా వేయబడి వుంటుంది.

కిటికీవద్దనున్న నటాషా బల్లమీద ఒక శిల్పం ఇప్పడే ప్రారంభించ బడినది వుంటుంది, దానిని ఆకారంలోకి తేవడానికి ప్రయత్నిస్తూ,

వాలంటీనా అక్కడ నిలబడివుంటుంది. అస్తమానం ఏదో మోస్తూ, నములుతూ, గొణుగుతూ, అమాలియా, ఆకుమ్మార్తన, ఈ కమ్మర్తన, తెగతిరుగుతూంటుంది. వాలంటీనా చేతిలోని మన్ను క్రిందపడేసి, చేతులు తుడుచుకుని, ఏదో ఆలోచనలో నిలబడుతుంది. అమాలియా ఆమె దగ్గరకొచ్చి రహస్యం చెప్పినట్లుగా గొణుగుతుంది.)

అమాలియా—కోలెంకా నిద్రలేచేడు. ప్రొద్దుటే కోడిగుడ్డు అట్టు అంటే వాడికి ఎంతో ప్రీతి. నీకు వాని మీద ప్రేమ అనేదిలేదు. వాడిని ఏడిపించేస్తూన్నావు. వాని సంగతే కనుక్కోవు. ఇంకా నువ్వు చాలా మంచికోడలివి అనుకున్నా.

వాలంటీనా—ఎలకలా ...ఏమీ తేడాలేదు. ఎవ్వరూలేని గదులలో పాకుతూ, సామానంతా కొరికి తగలేస్తుంది.

(నటాషా ఒకమూటతో వస్తుంది.)

నటాషా—(అమాలియాతో) ఏం చిన్నపిల్లవా ఏమన్నానా? దారి పొడూగునా, ఏదో పడెయ్యడమేనా? ఏరుకోనక్కరలేదూ? వంటయిల్లంతా మోకాలిలోతుంది. ఓ డజనుమందిపడి బాగుచేసినా తెమలదు.

అమాలియా—నికోలాయ్‌తో చెప్తావుండండి...

(వెడుతుంది.)

వాలంటీనా—తుక్కు.. చెత్త...గదంతా సిగరెట్టుపీకలే.

(క్లారా ప్రవేశించి, తనగదివేపు నడుస్తుంది.)

క్లారా—నాసంగతే మరిచిపోయేవుకదూ, నటాషా? నిద్రవేళకి తప్ప ఇంటిక్కి రావడంలేదు జోనా?

నటాషా—నిన్నో సంగతి సలహా చెయ్యాలనుకుంటున్నాను, అత్తయ్యా!

క్లారా—ఏమిటమ్మా!

నటాషా—నాన్న తెగతాగుతున్నాడు. నిన్న మేమిద్దరం పేచీ డ్డాం. తాగుబోతు తండ్రిదగ్గర నేనుండనన్నాను. అయితే లేచిపొమ్మ

న్నాడు. నాసామాను తీసుకుని వెళ్ళిపోతాను. బోబ్రోవుమామయ్యదగ్గర వుంటాను. అక్కడినుంచి మాపయోనీర్ పిల్లలలోకి వెళ్ళి, వాళ్ళతో వుండిపోతా.

వాలంటీనా—ఇదంతా నిగ్గసంగా, చెత్తా - చెదారంతోనిండివుంది. ఇక్కడికి ఎవ్వరూ రావడమేనాలేదు...ఆయనగారు మంచంమీద... గుడ్డయేనా ఎరగకుండా...పడివుంటాడు. తిడతాడు...కొట్టబోతాడు. క్లాడ్యావాసిలీనా! ఇంక ఈబాధ భరించలేకుండావున్నా.

నటాషా—మనం అందరం వెళ్ళిపోదాం. రా. తన కూతురుసలహా విననందుకు తగినశాస్తిచేద్దాం. నీసామాను తెచ్చుకుంటావా? వొద్దూ? పోనీలే. ఇబ్బందిలేదు... నాతువ్వాలుంది...

క్లారా—ఏం చేద్దాం. రాండి. టీ పెట్టుకుందాం. త్రాగుతూ. ఏం చెయ్యాలో నిర్ణయించుకుందాం.

నటాషా—టీ నేను పెడతాను...మనం మాట్లాడుకోవచ్చు.

(షెకోవాయ్ వస్తాడు.)

షెకోవాయ్—(అక్కడున్నవా రందరితోటీ) వాలంటీనా మా యమ్మని ఎలక అందిట...(వాలంటీనాతో) ఎలకపిల్లలు ఎలకలే. అయితే నేనూ ఓ ఎలకనేనా నీమాటకి అర్థం? అంతేనా? నీమాట అదేనా?

వాలంటీనా—నాజీవితంలో మార్పుతేగల కీలకం నీ ప్రేమాను బంధంలో వుందని భ్రమపడి నీసహాయం కోరేను.

షెకోవాయ్—"మనిషిని మార్చడం అంటే ఏదయినా ట్రాక్టరు బాగుచెయ్యడం అనుకున్నావా?" ఈమాట ఎవరన్నారు? జ్ఞాపకంలేదు. ఏమీ జ్ఞాపకంలేదు. ఊహు — జ్ఞాపకంవుంది. నన్ను పార్టీలోంచి గెంటేసేరు. ఇన్‌స్టిట్యూట్ లోంచి తరిమేసేరు. ఆసంగతి మరచిపోలేదు. ఈ ముసిలిదే నన్ను పార్టీలోంచి గెంటించింది. ఆవిడతో నువ్వు మాట్లాడకొద్దని చెప్పలేదు?...చెప్పేనా — లేదా?

నటాషా—ఆత్మ విమర్శనకి నీ అడ్డేమిటి?

షెకోవాయ్—నోరుముయ్యి!

క్లారా—(వాలంటీనా, నటాషాలతో) రాండి!

షెకోవాయ్—వాలంటీనా! ఆగు. నటాషా! నీగదిలోకి పో.

క్లారా—మమ్మల్ని పోనియ్యి.

షెకోవాయ్—పనికిరాదు.

క్లారా—(ఘుంకారంగా, అధికారస్వరంతో) నన్ను పోనియ్యి!

(మీదికి వెడుతుంది. ఎలెనా వస్తుంది.)

ఎలెనా—ఎవరు, ఎవర్ని అడ్డుపెడుతూన్నారు?

నటాషా—లెనావచ్చిది! లెనోకా! (ఆమెవద్దకు పరుగెత్తుతుంది.)

క్లారా—అమ్మయ్యా! ఎంతకాలానికి!

(ఒక సూట్‌కేస్ తీసుకుని కింబయీావు వస్తాడు. అతని వెనకనే బోబ్రోవు వస్తాడు.)

కింబయీావు—క్లారా... ఒకఅతిథి. ఒక అతిథి వచ్చింది...(పెట్టె క్రింద వుంచుతాడు.)

బోబ్రోవు—ఇన్‌స్టిట్యూటుయొక్క కొత్త డైరెక్టరుని, పార్టీ సెక్రటరీ సైలువద కలుసుకున్నాడు. (గదివిడిచి వెళ్లిపోబోతూన్న కింబయీావుని చూపుతాడు) ఆతని అసిస్టెంటుకూడా (తనని చూపుకుంటాడు) దగ్గరుండి తగినమర్యాదలు నిర్వర్తించేడు.

నటాషా—ఎలెనా, అయితే ఏకంగా వచ్చేసేవు అన్నమాటేనా?

ఎలెనా—ఔనమ్మా! ఏకంగానే. వాల్యా! ఏలావున్నావు? వాల్యో, నికోలాయ్! గడ్డంమాయబెట్టి, ఏమిటావికారస్వరూపం? ఎప్పుడూ నీళ్ళు పోసుకోడంలేదా?

వాలంటీనా—ఒళ్ళెరిగివుండేది ఎప్పుడు? (వెడుతుంది.)

నటాషా—నాసామానుకూడా నీగదిలో పెట్టుకుంటా.

ఎలెనా—పెట్టుకో. మనం ఇద్దరం వుందాం.

నటాషా—క్లారా అత్తయ్యగదిలో టీ పెట్టుకుందాం, రా.

(క్లారా గదిలోకి పరుగెత్తుతుంది.)

క్లారా—అయితే నువ్వు ఇప్పుడు దేశ భాషలకి అలవడ్డట్టు కనబడు తుంది.

ఎలెనా—నేనిప్పుడొక ప్రొఫెసరుని. అదీగాక, నికోలాయ్ అనే వాడులే...నాగరికంగా బ్రదకడం ఎవ్వరినీ బాధించదు...అని. నమ్ము నమ్మకపో. నేను అన్నీ కొత్త అలవాట్లు చేసుకున్నా. సంగీతం నేర్చుకుం టున్నా. తరుచుగా విందులూ - వినోదాలకీ పోతున్నా...నేనే. నన్ను గురించే!

(నటాషా, టీ - కెటిల్‌తో వస్తుంది.)

కింబయీవు—ఒంటరిగానే వున్నావా, లేక...

ఎలెనా—ఇంతవరకు ఒంటరిగానే వున్నా, హన్సేన్...

కింబయీవు—అది మంచిపని... (మృదుస్వరంతో) మన అతిథి ఎలెనా, ఎంత అందంగా; ఆరోగ్యంగా, తెలివిగావుందో చూసేవూ?... (సిగ్గుపడి) నటాషా! మీరు నీళ్ళు ఎక్కడ పెడతారు?

(నటాషాతో వెడతాడు.)

బోబ్రోవు—పార్టీ సెక్రటరీ, కొత్తమానేజింగ్ డైరెక్టరుని చూసి ఒళ్ళు మరవలేదుగదా, అనుకుంటున్నా.

ఎలెనా—మంచివాడు...వచ్చేలోపుగా ఇక్కడి సంగతులన్నీ రెండుమూర్లు ఏకరువు పెట్టేడు...ఏమిటి ఇంత చెత్తతో వుందిగది. శుభ్రంగా వుండేగదికి ఏం అవసరపడింది?

క్లారా—ఈగది ఇప్పుడు యుద్ధరంగంలోని కందకం అయిపోంది. షికోవాయీ, నేనూ, ఓ అంతర్యుద్ధం సాగిస్తున్నాం. నేను అతడిని పార్టీనుంచి గెంటేసేను. అతడు నన్నీ గదినుంచి గెంటెయ్యాలని చూస్తు న్నాడు. ఈవిధంగా నడుస్తోంది, యుద్ధం,

ఎలెనా—నిన్ను చూసుకుని నువ్వేనా సిగ్గుపడటంలేదు, నికో లాయ్? (షికోవాయ్ ఊరుకుంటాడు. నటాషా, కింబయీవులు వస్తారు.) హాన్సేన్, ఇల్లా, రా. సామాను సర్దుకుందాం.

కింబయీావు—ఆలాగే!......

(నటాషా టీ - కెటిల్‌తో వేడినీరు తెస్తుంది.

ఎలెనా—కింబయీావులు గదిసర్దుబాటు చేయడం ఆరంభిస్తారు.)

ఎలెనా—నూాడు పంచవర్గ ప్రణాళికలకి సరిపడా ప్లాన్లు వేసుకుని వచ్చేను.

బోర్బోవు—ఇన్స్టిట్యూట్‌ని బాగా పెంపు చెయ్యవలసి వుంది. ఎలెనామాకరోవా...

కింబయీావు—(మధ్యలో) 18 గురు గ్రాడ్యుయేట్ విద్యార్థులు కొత్తగావచ్చి చేరేరు. వాళ్ళల్లో పదిమంది పార్టీసభ్యులే. ఒక మంచి బలమైన పార్టీ సెల్ ఏర్పరచేము.

బోర్బోవు—పార్టీసెక్రటరీ వైనంతమాత్రంచేత నామాటకి అడ్డం రావడానికి అధికారంవుందా?

కింబయీావు—క్షమించు...మనసు నిలుపుకోలేకపోయేను. కానీ యి. మాట్లాడను.

బోర్బోవు—నూతన మానవుని విషయంలో ఇన్స్టిట్యూట్ శ్రద్ధ తీసుకుంటుంది.

ఎలెనా—ఆమానవుడు 'విజ్ఞానం: శ్రామికుడు' అనే మట్టి బొమ్మ కాదు. సజీవవ్యక్తి.

బోర్బోవు—నూతన మానవుడు సృష్టిచెయ్యబడుతూన్నాడు. ఇంక 15_20 ఏళ్ళల్లో మనం ఇత్వావరు యుగంలోవాళ్ళంలా అయిపోతాం.

ఎలెనా—నికోలాయ్ భడపడకు. నువ్వూ అభివృద్ధిపొందుతూనే వున్నావు. క్లారా! బొరోడిన్‌కి ఈతడిచ్చిన సమాధానం చక్కగాలేదు? పత్రికలలో చూసేను.

క్లారా—రాజకీయాలమీద దంచేసేడు. చిన్నచిన్న మాటలతో... అందరికీ అర్థం అయ్యే భాషలో మాటలాడేడు.

కింబయీావు—ఎలెనా! రాజకీయాలంది ఆమె. ఆరాజకీయాలు ఎవరు నేర్పేరో ఎరుగుదువా? నేను. ఇంకా సందేహం వుంటే ఎదటనే వున్నాడు, అడుగు.

బోబ్రోవు—నిజం.

కింబయిావు—నా శిష్యుడు సాహసికుడు—చూడు, ఏలాంటి పుస్తకాలు చదువుతున్నాడో. (బోబ్రోవు బీరువా-కేసులోంచి ఒక పుస్తకం తీస్తాడు.) డైలెక్టిక్ ఆఫ్ నేచర్! ఏమనుకుంటున్నావో. (బోబ్రోవుతో) శ్రద్ధగా చదువు. చదువు.

ఎలెనా—శాస్త్రజ్ఞుడు రాజకీయాలలోకి దిగితే దెబ్బతింటాడేమో. శతాబ్దాలలెక్క మరిచిపోవచ్చు.

బోబ్రోవు—శతాబ్దాలతరబడి ఆలోచన నీనుంచి నేర్చుకుంటా.

ఎలెనా—అయితే చీనాపింగాణీమాటేమిటి?

బోబ్రోవు—ఎలెనా!

ఎలెనా—ఫాస్టు చాలా మంచిపుస్తకం. సానటోరియమ్‌లో వున్నప్పుడు చదివేను. ఆ బొక్కెన తీసుకుపోయి నీళ్ళు పారపోసి, తోలిచి, శుభ్రమైన నీళ్ళు తీసుకురా. (బొక్కెన తీసుకుని బోబ్రోవు వెడతాడు.) హుస్సేన్! ఆకిటికీ తెరు. వీధులలో వసంతర్తువు - సూర్యరశ్మి తాండవిస్తూంటే, మీరిక్కడ విషవాయువులలో తలదాచుకుంటున్నారేం? (కింబయిావు తలుపులు తెరుస్తాడు.) మన కొత్తభవనం ముందు తోరణం మీద "రత్ననిధి విద్యాలయం" అని చెక్కించుదాం. దాని క్రింద ఈ మాటలు చెక్కించాలి. "ఆర్డర్ ఆఫ్ ది రెడ్ బేనర్ బిరుదం పొందినవారు సమిష్టి సంఘాలలో ముందుకు వచ్చినవారు, షాక్ - బ్రిగేడ్‌లలోని పనివారు, వీరే మానవసమాజం యొక్క రత్ననిధులు." బాగుంటుందా? ఈ విషయం వచ్చేటప్పుడు ట్రెయిన్‌లో తట్టింది.

కింబయిావు—రత్నం కఠినమైనది. అద్దాన్ని కూడా కొయ్యగలదు. నిప్పుకి చెక్కు చెదరదు. మెరిసిపోతూంటుంది. ఎలెనా! నువ్వు సరిగ్గా రత్నానివే.

క్లారా—హుస్సేన్! మతిసరిగ్గావుందా?

(అమలియా వస్తుంది.)

కింబయీవు—లైబ్రరీ పరీక్ష చేసి, జఖారోవు కుట్ర బయట పెట్టేను. నాకు మతి సరిగ్గా లేకపోవడం ఏంకర్మం? ఈ మెని చూసినప్పుడుమాత్రం నావొళ్ళు పరవశం అయిపోతూంటుంది...ఎలెనా, ఈటప్రింకు ఎక్కడ పెట్టను?

అమాలియా—నాదీ అట్రంకు. ముట్టుకోకు. నికోలాయ్! చెప్పు. ముట్టుకోవద్దని చెప్పు.

షెకోవాయ్—పోనిద్దూ!

కింబయీవు—తీసుకో ముసిలిదానా! పెంటల్లోపారేసుకో. (అమాలియా తనట్రింకు ఈడ్చుకుపోతుంది.) ఓరిబాబో! మహాతమాషాముసిలిదే.

షెకోవాయ్—షేన్! (చేతులూపుకుంటూ ద్వారంవేపునడుస్తాడు.)

ఎలెనా—నికోలాయ్!

(షెకోవాయ్ వెడతాడు.)

కింబయీవు—పోనిద్దూ. మరేం బాధలేదు.

ఎలెనా—బాధఎవరికి? తీసివేసిన పన్నుకి—

క్లారా—ఈపన్ను బాగా పుప్పిపట్టింది.

(నటాషా వస్తుంది.)

నటాషా—అమ్మయ్యా! ఉత్తరపుమెదిగాలి వెలుతురు. ఆతలుపు తెరవడానికి ఎన్నిమార్లు ప్రయత్నించినా ముసలమ్మ తెరవనిచ్చిందికాదు. టీ అయింది. కామ్రేడ్స్ నండి.

ఎలెనా—చేతులు కడుక్కుని వస్తున్నాం.

క్లారా—వెనోకా! ఏదీ ఈలారా. ఓమారు నీమొగం చూడనీ. (నుదురు ముద్దుపెట్టుకుని) 'ఈతలకాయా విజ్ఞానవిషయాలకిపనికివచ్చేది'...

(నటాషాతో వెడుతుంది.)

కింబయీవు—(వంటయింటివేపువెడుతూ) ఎలెనా! విను, ఇల్లాగ! నువ్వు నాకంటె తెలివైనదానివి. నాకంటె ఉన్నతస్థానంలో వున్నావు.

కాని, త్వరలోనే నిన్ను అందుకుంటా. మనం ఇద్దరం సమానులం కాగలిగినప్పుడు...అప్పుడు...నీతో ఓముఖ్య విషయాన్ని గురించి మాట్లాడుతా.

(బోబ్రోవు బొకెన్‌తో నీరు తీసుకుని వస్తాడు.)

కింబయీవు—లే. ఎలెనా చేతులు కడుక్కుందాం.

ఎలెనా—(బోబోవుతో) నికోలాయ్! టీ చల్లారిపోతూంది.

(ఎలెనా, కింబయీవులు వంటయింట్లోకి వెడతారు. బోబోవు నీటిబొకెన, శిల్పప్రతిమవున్న బల్లవద్దవుంచుతాడు. వాలంటీనా స్యూట్ కేస్ చేత దీసికొనివస్తుంది. ఆమె బొమ్మవేపు నడిచి, ఒక 'పేపర్ వెయిట్' తో దానిని పగలకొడుతుంది. బొమ్మ ముక్కలు, ముక్కలయి క్రింద బడుతుంది.)

బోబ్రోవు—అదేంపని?

వాలంటీనా—ఒకమేధావంతురాలి మతిభ్రమ. 'శ్రామికుడు: విజ్ఞానం!' శ్రామికుడు! నేను దీనిలో నూతనభావం ఏదీ కనపడేలాగు చెయ్యలేకపోయేను. కనక నే దీనిని పగలకొట్టడంలో నా కేలాంటి విచారమూ కలగడంలేదు. అంతా అసహ్యం! ఛండాలం! కాని, నికోలాయ్! నువ్వు మాత్రం బాగా మారిపోయేవు.

బోబ్రోవు—నిజం? నిజంగానే అంటున్నావా? నీమాట నిజమేనని తోస్తూంది. ఇదివర కెప్పుడూ నేను అధ్యాపకుడననే తలచేవాడిని. అందరికీ బోధించడమే నావృత్తి. కాని, నేను మళ్ళీ పాఠశాలలో మొదటి నుంచీ నేర్చుకుంటూన్నా. కాని, ఇంకా ప్రపంచాన్ని నీతిపథంలో నడిపించాలనే ధోరణి వదలలేదు. నిజమే...అది కష్టమైన విషయమే! కాని ఏమైతేనేంలే. నాభవిష్యత్తు స్పష్టంగా నాకంటియెదట కనబడుతూంది.

వాలంటీనా—నీఅంతట నువ్వే ముందుకి సాగలిగేవు. నేను ఫ్యాక్టరీలో పనిచేసినా ఫలితం లేకపోయేను.

(ఎలెనా, కింబయీవులు వస్తారు.)

ఎలెనా—(న్యూట్ కేసువంక గమనించి) వాలంటీనా! నువ్వు ఎందుకు వెళ్ళిపోతూన్నావు? నేనిక్కడ ఎన్నోరోజులుండను. ఈవేళ వెళ్ళిపోవడానికికూడా...

వాలంటీనా—మళ్ళీ రానిపద్ధతిమీదనే వెడుతూన్నా. ఈనికోలాయ్‌తో సంబంధంవొదులుకుంటున్నా.

కింబయీవు—ఓనికోలాయ్!...ఇంకోపెళ్ళాంకూడా నిన్ను వదిలి పెడుతూంది...వాల్యా! వెళ్లిపోయేముందు మాతో కాస్త టీ పుచ్చుకోరాదూ?

(వాలంటీనా వూరుకుంటుంది. ఎలెనా చల్లగా కింబయీవుని బయటికి తీసుకుపోతుంది.)

బోబ్రోవు—నువ్వు వెళ్ళిపోతూన్నావూ?

వాలంటీనా—చూడు. బురద...బూడిద ఇవే నేలమీద మిగిలేయి. వటిబూడిదే మిగిలింది నాకుకూడా...నన్నిగతికి తెచ్చింది మాతండ్రే... అతడే. అతడే. అన్నివస్తువులలోనూ సహజమైన భావనలుంటాయి. వాటిని కనిపెట్టుకువుండమని బోధించేడు...నేను షెకోవాయ్‌ని ప్రేమించేను... ప్రేమ సహజమైన భావన...ఆప్రేమద్వారా నేను కొత్తమనిషిని కావాలని సంకల్పం. కాని, ఈవేళ నాకు మిగిలిందేమిటి?...శూన్యం! ఎవ్వరికీ సంబంధించని శూన్యం!...మాతండ్రి నన్ను ధ్వంసంచేసేడు. నాశనం చేసేడు. తాను నాశనం అయ్యేడు. మాతండ్రిని ఎన్నిమాటలన్నా కసితీరడంలేదు.

(బొరోడిన్, వయోభారానికి వంగి నడుస్తూవస్తాడు. అతనిచేతుల్లో స్నో-డ్రాప్ పూవుగుత్తి ఒకటుంది. అతని వెనకనే నీడలా అమాలియా వస్తుంది.)

బొరోడిన్—ఊం. అను.

వాలంటీనా—నాన్న! నాన్నవచ్చేడు!

బో(బ్రోవు—ఇవాన్ ఇలిచ్! కూర్చో! ఇవాన్?

బొరోడిన్—వాల్యూసా! అను. అన్నీ అనెయ్యి!

వాలంటీనా—లేదు. అనను. తెలివితక్కువదానిని. నావోళ్లు నాకు తెలియలేదు.

బొరోడిన్—నేనూ ఒకమట్టిబొమ్మనే. నాకూ మిత్రులు లేరు. శిష్యులులేరు. కూతురులేదు. నిరాధారం - నిరంజనం!

వాలంటీనా—మాటలు వినలేను. ఏడుపువస్తూంది. (పరుగెత్తుతుంది)

బో(బ్రోవు—బాగావుంది. (ఆమెవెనకనే బయలుదేరి, అంతలో ఆగి బొరోడిన్ వంకచూసి, తిరిగి పరుగెత్తుతాడు.) ఇప్పుడే వస్తున్నా, ఇవాన్!

(బో(బ్రోవు వాలంటీనా వెనుక పరుగెత్తుతాడు. నటాషా క్లారా గది లోంచి వస్తుంది.)

అమాలియా—పొరపాటు. నువ్వు రావలసిన పనికాదు. రాకూడదు.

బొరోడిన్—నన్ను వేపుకుతినకు. ఆఖరికి నాకూతురు తత్వంకూడా తెలుసుకోలేకపోయేను. ముప్ఫయి అయిదేళ్ళ క్రితం నాఅవస్థ చాలా బాగుంది.

అమాలియా—ఇవాన్ ఇలిచ్! జ్ఞాపకంవుందీ? ముప్ఫయిఅయిదేళ్ల క్రితం... తాతియానాదినోత్సవం ... ఆపందిరి ... ఆపాలు... వేదికమీది ఆయువకుడు...

బొరోడిన్—నీయువకుడు నువ్వూ తగులబడిరి! నీ కాయువకుడు తప్ప మరో స్మరణలేదు. పోతావాతన్నా? (అమాలియా పారిపోతుంది.) ఏనాడో ఈమసిలిముండని ప్రేమించేనూ? ఏలా ప్రేమించేనో నాకేమీ తెలియడంలేదు. నాకిప్పుడు ఎక్కరూలేరు. నేను ఏక్! నిరంజన్!

నటాషా—నేనున్నాను, ఇక్కడ.

బొరోడిన్—నువ్వా, చిన్నిపయొనీర్!

నటాషా—ఆముసలమ్మ వట్టి ఎడ్డెమనిషి అస్తమానం ఏదో నము లుతూ, చప్పరిస్తూనే వుంటుంది.

బొరోడిన్ — నే నెప్పుడూ గమనించనేలేదు...ఔను, ఏదో నములుతూనే వుంటుంది.

నటాషా — ముప్ఫయిఅయిదేళ్ళ క్రితం రాజ్యాధికారం జార్, భూస్వాముల చేతుల్లోవుండేది. ఆరోజుల్లో పోలీసువాళ్ళుకూడా వుండేవారు. నిజంగా! ప్రతికూలివాడినీ బ్రదికివుండగా చర్మం వొలిచేసేవారట. ఒట్టు! వాళ్ళ విషయం లియోషాస్కా చెప్పేడు. వాళ్ళనాన్న నిజం పోలీసుని చూసేడట, నీకు తెలుసా. అతడే చెప్పేడు.

బొరోడిన్ — నే నిప్పుడే ఇన్‌స్టిట్యూట్‌కి వెళ్ళి వస్తూన్నా. ఓ మాటు చూసి రావాలని బుద్ధి పుట్టింది. అందుకోసమని వెళ్ళేను. వరాండాలన్నీ మహాగడబిడగావున్నాయి అన్నీ కొత్తమొగాలే. పడుచువాళ్ళు. నాగదికి తాళం వేసేవుంది. ఆగుమ్మం ముందు నిల్చుండి వాదించుకుంటున్నారు ఎంతో సౌమ్యంగా. ఒకడు తాళం పగలకొడదామన్నాడు. కాని, మిగిలినవాళ్ళు ఒప్పుకోలేదు. నేను కిటికీ వెనక నిలబడి వారు నామీద చేస్తూన్న విమర్శలన్నీ విన్నాను.

నటాషా — పోనీ ఆ తలుపు ఎందుకు తెరిచేవుకాదు?

బొరోడిన్ — (నటాషావంక చూసి, ఆలోచనతో) తెరవాలనే వుంది... కాని, ఎదటపడడానికి సిగ్గువేసింది.

నటాషా — సిగ్గేమిటి? ఓమాటు ఈలాగే స్కూల్లో ఒక కిటికీ అద్దం పగలకొట్టేను. మాట్లాడకుండా చల్లగా వూరుకున్నా. ఎవరు పగలకొట్టేరో తెలుసుకోడానికి వాళ్ళు అందర్నీ అడిగేరు. కాని, నేను పలకలేదు. ఒప్పుకోడానికి సిగ్గుపడ్డాను. కాని, కొంచెం సేపున్నాక నా అంత నేనే చెప్పేసేను. తరవాత మనస్సు ఎంత తేలికగా వుందనుకున్నావు?

బొరోడిన్ — ఔను...ఔను...నువ్వు చెప్పింది నిజం ... నాకు వెనక ఆసరా ఎవరూ లేరుగదా తల్లీ, సలహా అడగడానికేనా?

నటాషా — నీకేం తెలియదు. చర్చలకి మా పయొనీర్ దళంలోకి ఎందుకు రాకూడదు. మమ్మల్ని ఎందుకు సలహా చెయ్యకూడదు?

బొరోడిన్—బాగా పెద్దవాణ్ణి అయ్యేనుకాదూ?

నటాషా—ఔను. ఆమాట నిజం! పద్దానుగు ఏళ్ళకి మించి వారిని మాతో చేర్చుకోము. ఎందుచేతనో తెలుసా? ఇక్కడే కూర్చో. వస్తా.

(నటాషా క్లారాగదిలోకి వెళుతుంది. బొరోడిను ఒక్కడూ కూర్చుంటాడు. తన చేతిలోవున్న పువ్వులగుత్తివంక చూసి)

బొరోడిన్—వీధిలో స్నో-డ్రాడ్ గుత్తులు అమ్ముతూన్నారు. వచ్చేపోయేవారంతా వాటిని కొనుక్కొని ఆనందిస్తూన్నారు... నేనొక్కడనే గమనించలేదు...ఔను, నే నిప్పుడు పద్దానుగేళ్ళవాడినే అయితే. (బొరోడిన్ పువ్వులగుత్తివాసన చూస్తాడు. ఎలెనా—కింబయీావులువస్తారు.)

ఎలెనా—ఇవాన్! ఆరోగ్యమా?

బొరోడిన్-ఎలెనా మిఖైలోనా. .నాది తాళంచెవులు తెచ్చేను. ఇంద...(తాళంచెవులు ఇస్తాడు.) తీసుకో. తలుపులు తియ్యి...

ఎలెనా—నువ్వే తెరు. ఆ కొత్తగావచ్చిన గ్రాడ్యుయేట్లని నీ చేతి క్రిందికి తీసుకో. ఇవాన్? నువ్వు పనిలోనికి ఎప్పుడు వస్తావు? చెప్పు!

కింబయీావు—రా! కామ్రేడ్ బొరోడిన్! రా! అనుమానం ఎందుకు? మనం అందరం కలిసి పనిచేద్దాం. రత్నాలు వెతుకుదాం.

బొరోడిన్—విజ్ఞానానికిగాని, మీకు గాని, నే నెందుకూ పనికి రానని తలుస్తాను. ఎలెనా. ప్రిజల్ని గురించి పొరపడ్డాను. నా నిర్ణయాలు పొరపడ్డాను. ఆ తప్పులు సర్దుకోలేను.

ఎలెనా—ఇవాన్! పొరపాటు. తప్పులు సర్దుకోలేకపోవడం ఏమిటి? సర్దుకోవాలని వుంటే-

బొరోడిన్—వుంది!

కింబయీావు—ఒక్కడివీ శ్రమపడలేవు. మేము కూడా సహాయం వుంటాం.

ఎలెనా—సముద్రాన్నిగురించి తెలుసుకోడానికి ఒక గ్లాసెడు నీటితో పరిశోధనలు చేసినట్లు నీ గది కిటికీలో కూర్చుని ప్రపంచాన్ని

చూడబోయేవు. కాని, ఆగ్లాసులో, పోటు — పాట్లు, తుపానులూ కనపడతాయీ? పట్టి, ఉప్పు - నురగలూ - మరొకటీ కనబడుతుందిగాని. సరే, ఆనురగల్ని పట్టి, పోటుపాట్లు చెప్పబోయేవు. అంతేనా?

బొరోడిన్—అంతే?

ఎలెనా—బహిరంగంగా - స్పష్టంగా - నీ ఉపన్యాసాన్ని విమర్శించుకో.

బొరోడిన్—ఔను. అంతే.

(తలుపు తెరుచుకొని షెకోవాయ్ వస్తాడు.)

షెకోవాయ్.—అమ్మా! ఇంక భయం ఎందుకు? రా.

(అమలియా వస్తుంది. క్లారా - నటాషాలు ఒకగదిలోంచీ, బోబ్రోవు - వాలంటీనాలు ఒకగదిలోంచీ వస్తారు.)

షెకోవాయ్—ఇదిగో మీరంతా చూడలేదేమో. ఇదిగో నికోలాయ్ షెకోవాయ్ తల్లి ఈవిడే...ఇంక నామాటా - నేనొకమిలిటరీ ప్రాసిక్యూటరు కొడుకుని...

క్లారా—మాకిదివరకే తెలుసు.

షెకోవాయ్—నీకెవరుచెప్పేరు ... ఆచెప్పిన ద్రోహి ఎవడు? మిమ్మల్నే.

కింబయీవు—వెళ్ళవోయ్, పెద్దన్నా!

షెకోవాయ్—నాగుట్టు బయటపెట్టిన తుంటరిఎవడు?

బోబ్రోవు—నేను.

షెకోవాయ్—ఓహో. తమరా...ఆమె వాలంటీనాయా?... అయితే సరే. లే వెడదాం. అమ్మా నటాషా! రా, అమ్మా. వీధిలోకి పోదాం. చేతులుచాచి అడుక్కుని బ్రతుకుదాం. మమ్మల్ని అన్నిచోట్లనుంచీ తరిమేసేరని చెప్పుకుని ఏడుద్దాం. అమ్మా నిన్నూ తరిమివేసేరు కదా, నాకూతురని తెలిసేక నటాషాని మాత్రం వుంచుతారా?

నటాషా—(అతని చేతులలోంచి విదిలించుకొని) అబద్ధం! వాళ్ళు నన్నెందుకు గెంటేస్తారు? క్లారా! ఏమేనా కారణంవుందా?

క్లారా—అతనితో మాటలేమిటి నటాషా!

ఎలెనా—వట్టి ఉడుకుబోతువాడివి, నికోలాయ్.

షెకోవాయ్—ఓ, శ్రామిక మహాశయ!....రెడ్ డైరెక్టర్!...మహా వ్యక్తి! అహా! (నవ్వుతాడు) నమస్కరించేదా? ... లేవమ్మా, వెడదాం. ఇక్కడికి తృప్తి కలిగిందా. నలుగురిముందూ నీకొడుకునని వొప్పుకున్నానా? ఏంసంతోషంకలిగిందా? (బొరోడిన్‌తో) రావయ్యా! రా. పోదాం. మనం అంతా ఒకేముఠా. మహాపురుషులం! నువ్వా ఇంక ఎందుకూ పనికి రావుకదా? పాత చెప్పు...ఏమంటూంది నీజ్యోతిషం!...

(షెకోవాయ్ వెళ్లిపోతాడు. గొణుక్కుంటూ వెనకాలే అమాలియా వెడుతుంది.)

క్లారా—(బొరోడిన్ వద్దకు వచ్చి) ఇవాన్! నామాటనమ్ము. నేనూ ముసలిదానినే అయినా నేనింకా పనిచెయ్యగలను. మనల్ని మారంచెయ్యడం ఇప్పుడప్పుడే జరగవలసిన పనికాదు కాని, మనం కావాలంటే పెన్షన్ ఇచ్చి పంపివెయ్య వచ్చుననుకో...

బొరోడిన్—వద్దు. పెన్షన్ వద్దు. నేనింకా పనిచేస్తా. ఎలెనాతోటీ, కింబయీవుతోటీ కలిసి పనిచెయ్యాలనివుంది...ఆమిగిలినవాళ్ళు వద్దు...వద్దు...వాళ్ళ ఇష్టంవచ్చినట్లల్లా కూనుకోనియ్యి. ముసిలాడికి పైప్రాణాలు పైనేపోయాయి అనుకోనీ. తన నమ్మకాలు బలవంతంగా విడిచిపెట్టుకున్నాడననీ - నాకేం లెక్కలేదు. నేను జాగ్రత్త పెట్టిన కుందేళ్ళు ఏవిధంగా కొండచిలువలుగా ప్రవర్తించేనో అందరికీ చెప్తా. నేను మాకగోవాకి భయపడ్డాను. ఆవిడని దగ్గరకి చేరనియ్యలేదు. తప్పుమార్గాన పైచేను. కాని, హెర్మన్‌ని దగ్గరకి చేరతీసేను. ఆసంగతికూడా చెప్తా. 'భయం'కి సంబంధించిన ప్రతి చిన్న విషయాన్ని ఆనందంతో ఎత్తుకున్నా. నిర్భయత్వాన్ని నిరాకరించేను. కింబయీవుయొక్క పిచ్చిధోరణికి ఎగిరి గంతువేసేను. కాని, అతనిలోని ఆత్మాభివృద్ధి మరిచిపోయేను...సంకుచిత

మైన బ్రతుకు బ్రతికేను. నాగది - నాయిల్లు దాటలేదు. నిజమైన జీవితం అంటే ఏలావుంటుందో అర్థంచేసుకోలేకపోయేను... జీవితాన్ని దూరంచేసినందుకు, అది ఒంటరితనం శిక్షగా విధించింది... భయంకరప్రతీకారం. నిజంగా ఏడుపొస్తూంది. సిగ్గుపడవలసిన పనేముంది?... తాళంచెవులు కావాలి అని అధికారయుతంగా అడుగుతూన్నవాళ్ళ చేతులకిస్తా. నాతాళం చెవులన్నీ ఇచ్చేస్తా. డైరెక్టర్! నీమరతులన్నీ నాకిష్టమే. (క్లాగ'తో) నువ్వూ - నేనూ ఇంకా కొంతపనిచెయ్యగలం. ఆ 'పాతచెప్పు' అనడం ఏమిటో ఓమాటు చూపిస్తా.

[తెర]



శ్రీ కొండపల్లి ప్రింటింగు వర్కుస్సు, రాజమండ్రి.



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA126B156 |
| పుస్తకం పేరు | భయం |
| తారీఖు | 30/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 115 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | P. Jayamma |
| పేజీలు విడదీసినది | P. Jayamma |
| స్కాన్ చేసినది | Prathyusha |
| పరీక్ష చేసినది | THASIN |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |